# మౌనప్రకాశము



జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

# మౌనప్రకాశము



జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు



ప్రచురణ

అవతార్ మెహర్‌బాబా మచిలీపట్నం సెంటరు

మచిలీపట్నం

# MOUNA PRAKASAMU

by

G. V. G. K. CHANDRAMOULESWARA RAO

Published in July 1985

Price : Rs. 4-00

For Copies :
G. V. G. K. Chandramouleswara Rao
29-36-12, Museum Road
V I J A Y A W A D A - 520 002

or

Avatar Meherbaba Machilipatnam Centre
Fort Road, Machilipatnam - 521 001

Printed at Spandana Printers, Machilipatnam

# తొలిపలుకు

సుఖ జీవితమునకు రహస్యము, కామ క్రోధ మద మోహ ప్రవర్తనలో కాక, తృప్తి, శాంతి, సహనము, అందరిలోను అన్నింటిలోను భగవంతుని ఉనికి చూచుటలోనే యున్నది. ఇది జీవిత విధానములో అనుకరించుట దుర్లభము. అందరికీ తెలిసినదే కాని ఎవ్వరూ చేయలేనిది. దానికి ప్రధాన సోపానము మౌనము. మౌన కార్యక్రమములో ఉద్రేకము లకు తొందరపాటుకు తావులేదు. సహనాన్ని వృద్ధిపొందిస్తుంది. సక్రమ ఆలోచనాశక్తిని, ప్రశాంత వాతావరణమును సృష్టిస్తుంది. భగవంతుడు కూడా తన కార్యక్రమాన్ని మౌనముతోనే నిర్వహిస్తాడు. సూర్య చంద్రులు మౌనముగానే లోకమునకు వెలుగునిచ్చి, సస్యశ్యామలముగా, ఆరోగ్య వాతావరణము కలుగజేస్తారు. మహాఋషులు మౌనముతోనే వారి ఆధ్యాత్మిక శక్తిని వృద్ధిచేసుకొని, ప్రపంచ శాంతిని, సుఖాలను వెదజల్లుచున్నారు. అట్టి మౌనము లోకశాంతికి, ఆధ్యాత్మిక పురోభి వృద్ధికి, సకల జీవరాశుల సహజీవనానికిగాను బాబా యీ అవతారములో అవలంబించినారు. ఉపన్యాసములు, బోధలు, గ్రంథ పఠనములవల్ల కలిగే ఆనందము, వైరాగ్యచింతన తాత్కాలికము మాత్రమే. బాబా ప్రేమికులుగా July 10వ తేదీన మౌనము పాటించుటలో, ఒక్క రోజులోనే మన సామాన్య ప్రవర్తనకు ఎంత అవరోధమో తెలుసుకొను చున్నాము. 1925 జూలై 10 వ తేదీన ప్రారంభించిన మౌనమును జీవితాంతము వరకు అనగా 1969 జనవరి 31 వరకూ నిరాఘాటముగా ఎట్టి కార్యక్రమములకు అవరోధము కాకుండా, మానవాళిని మేల్కొలిపి వారి ఆధ్యాత్మిక పురోగతికి లోటులేకుండా, కొనసాగించారు. అది వారి శ్రేయస్సుకుగాక, లోకశాంతికి, రక్షణకు మాత్రమే.

ఇప్పటి క్లిష్టపరిస్థితులు బాబా సూచించియున్నారు. ముప్పాతిక ప్రపంచము నశించగలదన్నారు. తృటికాలములో కోటానుకోట్ల నష్టము. ఈమధ్యనే వందలాది అధికారులను, ధనవంతులను శవాలుగా మార్చిన వైమానిక ప్రమాదము మనకు చెవులలో మారు మ్రోగుచున్నది. కాని జీవితము ఎంత తృణ ప్రాయమో అంత ప్రాధాన్యమైనది. సృష్టి స్థితి లయాలకు మన జీవితవిధానమే కారణము. మౌనముతో యావత్తు ప్రపంచము జయించవచ్చును. ఆధ్యాత్మిక సింహాసనము ఆక్రమించ వచ్చును. బాహ్యసుఖములు మిధ్యలుగా తెలుసుకొని, నిజజీవిత గమ్యమును చేరి తాను భగవంతునిగా మారగలడు. మహర్షి శుద్ధానందభారతివారి ప్రోద్బలముతో యీ ప్రచురణ జరుగుట దీనికి ప్రత్యేక ప్రాముఖ్యత. రచయితకు నా అభినందనలు, చదువరులు దీనివలన సత్ఫలితము పొందుదురుగాక.

మచిలీపట్నం
10-7-1985

తాడేపల్లి బసవయ్య
అధ్యక్షుడు
అవతార్ మెహర్‌బాబా సెంటరు

# పీఠిక

'మౌన ప్రకాశము' అన్న ప్రచురణ, శ్రీ జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వరరావు గారిచే వ్రాయబడింది. శ్రీ మెహర్‌బాబా పాటించిన మౌన ప్రాశస్త్యాన్ని తేటతెలుగులో చక్కగా వివరించారు. ఆంధ్ర ప్రేమికులీ గ్రంథాన్ని జాగ్రత్తగా చదివి లోలోతును గ్రహింతురుగాక.

భ్రాంతిలో మునిగి కొట్టుమిట్టాడుతున్న మానవాళిని, విషయ వాసనలకు దూరంచేసి, తమ నిజస్థితిని తెలుసుకోగలిగి, తనంత వారినిగా మార్చేందుకు, మెహర్‌బాబా పాటించిన అద్భుతమౌనం, ఎంతగానో వుపయోగపడింది.

అవతారుడు చేసే విశ్వకార్యక్రమం, భౌతిక శాసనాలబట్టి కాక, పైలోకంనుండి, అతీత శాసనాలద్వారా, ఆయన ఆధ్యాత్మిక తాబేదారుల ద్వారా జరుపబడతాయన్న బాబా వివరణల ననుసరించి కొనసాగిన యీ రచన బహుళ జనాదరణ పొంది, అశేషాంధ్ర ప్రేమికుల ప్రశంశలంద గలదని ఆశిస్తున్నాను.

సోదరులు శ్రీ చంద్రమౌళీశ్వరరావుగారు, ఆంధ్ర ప్రేమికులకు ఇంతవరకూ చాలా రచనలందించారు. వారింకా మరిన్ని రచనలు చేసి, అవతారుని లీలా విశేషాల్ని తెలుగువెలుగు చూచేటట్లు తగు శక్తిని ప్రసాదించాలని బాబాను ప్రార్థిస్తున్నాను.

10-7-85
విజయవాడ

చింతా సర్వారావు
అధ్యక్షులు
అవతార్ మెహర్‌బాబా ఆంధ్ర కేంద్రము

# విజ్ఞాపన

ఈ 'మౌన ప్రకాశము' వ్రాయటానికి ప్రోద్బలం చేసింది పూజ్యులు, మహర్షి కవియోగి శుద్ధానందభారతి. ఎంత తరిచినా అంతుచిక్కని బాబా మౌన ప్రాశస్త్యాన్ని కొంతవరకూ వివరించటానికి ప్రయత్నించాను. మౌనావతార అవసరాన్ని వివరించేందుకు, శుద్ధానంద భారతిగారు చెప్పిన కథని యిందులో పొందుపరచేందుకు అనుమతించి నందుకు, వారికి నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.

60 వ మౌనవార్షికోత్సవంలో, యీ "మౌనప్రకాశము" వెలువ రించాలన్న తలంపుతో పూనుకోగా, అందుకు ప్రోత్సాహాన్నిచ్చిన మచిలీపట్నం సెంటరు అధ్యక్ష, కార్యదర్శులు శ్రీ తాడేపల్లి బసవయ్య. శ్రీ గుడివాడ రామచంద్రరావు గార్లకు నా హృదయపూర్వక అభివాదములు.

ఈ ప్రచురణని, 28-7-85 న రాజమండ్రిలో జరుగుతున్న, ఆంధ్ర కేంద్రం గవర్నింగుబాడీ సమావేశ సందర్భంలో అవతార్ మెహర్‌బాబా ఆంధ్ర కేంద్రము అధ్యక్షుల్కు శ్రీ చింతా సర్వారావుగారి చేత ఆవిష్కరించబడుట బాబా కృపా విశేషంగా భావిస్తున్నాను. సమయం తక్కువే వున్నా, సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది, అనతికాలంలోనే అచ్చొత్తించి యిచ్చిన స్పందన ప్రింటర్సు, మచిలీపట్నం వారికి నా ధన్య వాదాలు. నాయింతకుముందు రచనల వలెనే, దీనిని కూడా సహృదయులైన ఆంధ్రప్రేమికులు స్వీకరించి, బాబా ప్రేమాశీస్సులు పొందగోరుచున్నాను.

—జై బాబా

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

# మహర్షి డా॥ శుద్ధానందభారతి జీవిత సంగ్రహం

కవి, యోగి, మహర్షి డా॥ శుద్ధానంద భారతి, భారతమాత ముద్దు బిడ్డలలో అతి అరుదుగా కనిపించే, మేటి రత్నం. యీయన బహు భాషావేత్త, విద్వాంసులు, తపశ్యులు, శాస్త్రవేత్త, కవి పుంగవుడు, పుణ్య పురుషుడు. చదువుకున్నది ఎమ్. ఎ. అయినా, తనలో ఆయన ఓ విశ్వ విద్యాలయాన్నే నిర్మించుకున్న మహా జ్ఞాని. ఇంగ్లీషు, ఫ్రెంచి, తెలుగు, తమిళ భాషల్లో మహా పండితుడు. హిందీ, సంస్కృతములు కరతలా మలకములు. వీరు యోగులు, విద్యావేత్తలే కాక దేశభక్తులకు చెందిన వెలనాటి బ్రాహ్మణ కుటుంబమునకు చెందిన మహనీయుడు. తండ్రి చివుకుల జటాధరి. తల్లి కామాక్షి. తల్లిదండ్రులు వీరికి చేసిన నామకరణం శ్రీ చివుకుల వేంకట సుబ్రహ్మణ్యం. వీరు ప్రథమ సంతానంగా తూర్పు గోదావరి జిల్లా అమలాపురంలో 1880 లో జన్మించారు.

వీరి పెద తాతగారు, పూర్ణానంద భారతి, చిన్నప్పుడే ఇల్లు వదలి ఒక సన్యాసితో హిమాలయాలకు వెళ్ళి కేదారనాథ్‌లో తపస్య జీవనం సాగించిన మహాత్ముడు. శుద్ధానంద భారతీజీకి యీయనే, గీత, రాజయోగం బోధించటంతోపాటు, గాఢ సమాధి స్థితికి చేరేట్లు సహాయపడ్డారు.

శుద్ధానంద భారతి బాల్యమంతా బహు విచిత్రంగా సాగింది. మనస్సెప్పుడూ చదువు మీద లగ్నమై వుండేది కాదు. టీచర్లు పాఠాలు చెబుతుంటే, స్వంత కవిత్వం వ్రాస్తూ కూర్చుని, తరచు ఉపాధ్యాయుల దండనకు గురై అవహేళన గావించ బడేవారు. ఒక రోజున టీచరు ఒక పద్యాన్ని వప్పగించమని అడుగగా, స్వంత కవిత్వంతో వేరే పద్యం చదివేసరికి గురుపు కోపంతో క్లాసునుండి బయటకు పంపేశాడు.

అంత గురువు కోపానికి భయపడి దగ్గర్లో వున్న ఒక మామిడి తోట లోకి పారిపోయారు. యీయన్ని వెతుక్కుంటూ వచ్చిన తరగతి లీడరు. విరగ కాచిన మామిడి కాయలు చూచి నోరూరి, ఒక కాయకు గురి చూచి రాయి విశిరాడు. ఆ రాయి తిన్నగా వెళ్ళి ఆ చెట్టు క్రింద ధ్యానంలో కూర్చున్న శుద్ధానంద భారతి తలపై పడి బలమైన గాయమైంది, బలబలా కారే రక్తం చూచేసరికి శుద్ధానంద భారతికి, యీ వికృత ప్రపంచంపై విరక్తి కలిగి సమీపంలో వున్న చెరువులో దూకి ఆత్మహత్యకు పాల్పడ్డారు. నీటిలో మునుగుతున్న తనకు ఒక అమృత హస్తం సహాయ పడి బయటకు తీసి రక్షించింది. కళ్ళు తెరచి చూచేసరికి, ఒక యోగి, తన యెదుట నిలబడి వున్నారు. ఆ యోగి తనకో మామిడి పండు ప్రసాదంగా యిచ్చి, వెన్ను నిమిరేసరికి ఆయనలో విద్యుత్ ప్రవహించి నట్లయింది. అంతర్గతంగా వున్న కుండలిని మేల్కొలిపి, భవిష్యత్తును చిత్రీకరించారు. ప్రఖ్యాతి గాంచిన మహాత్ముల్ని కలిసి, ఆశీర్వాదములు పొందమని ఆదేశించాడా యోగి.

గురు వాదేశ ప్రకారం, జ్ఞానశిద్ధుని కలిసి మొదటగా జ్ఞానాన్ని సముపార్జించి ఆయనచేతనే “శుద్ధానంద భారతి” అనే పేరును పొందారు. తరువాత, షిరిడీలో సాయిబాబా, ఖేడ్గాంలో నారాయణ మహారాజు, పూనాలో బాబాఖాన్, నాగపూరులో తాజుద్దీన్ బాబా, హుబ్లీలో శిద్ధఅవుడుదా, తిరువణ్ణామలైలో రమణమహర్షిని, పాండిచ్చేరిలో అరవిందుడు వంటి మహనీయులెందరినో కలిసి, ఆధ్యాత్మిక శిక్షణతోపాటు, ఆశీర్వాదములు పొందిన ధన్యజీవి. రమణమహర్షి ఆదేశంతో తిరువణ్ణామలై కొండల్లో తపమాచరించారు. అరబిందుడు, అమ్మ యిరువురు ప్రత్యేక శ్రద్ధ తీసుకొని, అత్యున్నత మానసికయోగం బోధించారు. యీ యిరువురు మహనీయులు యీయన్ని గొప్ప ప్రేమించికవిగా తీర్చిదిద్దారు. వారి చెంతనే మహర్షి దాదాపు 25 ఏళ్లు మౌనంలో గడిపారు. ఆ రోజుల్లోనే శుద్ధా

నందభారతి తమిళంలో "భారతశక్తి" అనే వృద్ధగ్రంథాన్ని రచించారు. "పిల్గ్రిమ్‌సోల్" అనే మరో గ్రంథం వీరి ఆధ్యాత్మిక జీవన స్రవంతిలో ఒక కలికితురాయి. జీవిత గమ్యం, ఆత్మసాక్షాత్కారం గురించి ఈ రెండూ స్వామీజీ వెలువరించిన అమూల్యగ్రంథాలు.

పిల్లలేని మేనమామ పెంచుకుందామని ఎంత ప్రయత్నించినా, తాను తల్లి మీనాక్షీదేవికే కుమారుడ్నని తిరస్కరించారు. మీనాక్షి ఆలయ పూజారి, దేవేంద్ర భట్టాచార్జి, ఆయన భక్తిని ప్రోత్సహించి, ప్రసాదం పెట్టటమే కాక, ఆగమశాస్త్రాలన్నీ బోధించాడు. పెద్దల ప్రలోభాలకు లోనుగాక; దాదాపు తొమ్మిది సార్లు జరిగిన వివాహ ప్రయత్నాలన్నిటినీ వమ్ము చేసి, నైష్టిక బ్రహ్మచారిగా వుండిపోయారు.

రోమన్ కాతలిక్కులతో సన్నిహితమవటంతో తిరుచునాపల్లిలోని మిషనరీ కాలేజీలో సైన్సు ప్రొఫెసరుగా కొంతకాలం పనిచేసి, ఆర్థిక సంపాదనచేశారు. అత్యున్నత స్థాయి వ్యక్తుల మధ్య పలుకుబడి వున్నా ఆయన ఎన్నడూ పేరు ప్రఖ్యాతులకు తాపత్రయపడలేదు. హట, రాజ, మంత్రతంత్ర, కర్మ, భక్తి, జ్ఞాన, లయ యోగాలన్నిటినీ పుక్కిట పట్టిన ప్రజ్ఞాశాలి. జ్ఞాన సముపార్జనకై తన జీవితాన్ని 20 ఏళ్ళపాటు ధార పోశారు. 30 ఏళ్ళు అఖండ మౌనం పాటించారు.

యోగి శైవ శిఖామణి, వీరిని తమిళంలో పరిపూర్ణునిగా చేశారు. ఆర్థిక సమశ్య తీరేందుకు ప్రొఫెసర్ వుద్యోగంతో పాటు, ఒక దినపత్రిక ఒక వార పత్రిక, ఏడు మాస పత్రికలకు సంపాదకునిగా పనిచేశారు. ఎన్నో పుస్తకాలు వ్రాయటంతో పాటు, కొన్ని పత్రికలకు వ్యాసాలు వ్రాసి, ఆర్థికంగా బలపడ్డారు. ఏ రూపంలో సంపాదించినా, చేతికి వచ్చిన ప్రతి పైసా జ్ఞానయజ్ఞంలోనే వినియోగించారు.

ఒకసారి మహర్షి సింగపూరులో వుపన్యశించే సభకు మాల్కోం మాక్డోనాల్డు అధ్యక్షత వహించి, స్వామీజీని పరిచయం చేస్తూ "వీరిని

గురించి మాట్లాడాలంటే, ఎక్కడ మొదలు పెట్టాలో ఎక్కడ అంతం చేయాలో చెప్పటం కష్టం. అంతం లేని అత్యద్భుత దైవకృప ఆయనపై వున్నందున, అమూల్యమైన ఆధ్యాత్మిక సంపద సాధించిన మహనీయుడాయన. తక్కువ జీవితకాలంలో బహు కొద్ది మంది మాత్రమే యిటువంటి విలువైన జీవితాన్ని గడపకలరు" అంటూ కీర్తించాడు. విశ్వ విఖ్యాతి నార్జించిన మహాత్ముల జీవిత చరిత్ర ప్రక్కనే వీరి జీవితం చోటు చేసుకుంది.

మహర్షి శుద్ధానంద భారతికి మహర్షి అన్న పవిత్ర నామాన్ని యోగ వేదాంత అటవీ విశ్వ విద్యాలయం రిషికేష్ వారు ఛాన్సలర్ శివానందద్వారా 11-5-1957 న బహూకరించారు. కంబన్, వాల్మీకి, వ్యాసుడు, హోమర్, మిల్టను వంటి మహనీయుల కోవకు వీరిని తాను వ్రాసిన 50, 000 పంక్తులున్న "భారతశక్తి" అన్న మహాకావ్యం చేర్చింది. యీ "భారతశక్తి" దైవిలువంటిదని స్వామి శివానంద శ్లాఘించారు. దీన్ని మరో మహాభారతంగా గాంధీజీ అభివర్ణించారు. భారతశక్తి "భారతవాణి" అని అరబిందులన్నారు. అన్ని మతాలకు, యుగాలకు ప్రతీకగా నిలిచేదీ వుద్గ్రంధం. భగవద న్వేషకులు తప్పక చదవ వలసిన గ్రంథరాజమిది.

తనకున్న యావదాస్తులు ధర్మకార్యాలకు వినియోగించారు. యోగ సమాజ్‌లో వీరు నిర్మించిన ప్రార్థనామందిరం ఆయన పేర్కొన్న "సమ యోగ" మునకు ప్రతీకగా నిలుస్తుంది. ఆ కట్టడపు గోపురానికి వాడిన సప్తవర్ణపురంగులు మధ్యలో అమర్చిన ఓంకారపు అద్దం, పరిశుద్ధతికి కాంతికి, మౌనానికి దర్పణం పడతాయి. ఒకే దైవం, ఒకే ప్రపంచం ఒకే మానవాళి, యివే ఆయన ధ్యేయం. భోగభాగ్యాల్ని తృణప్రాయంగా త్యజించి, జీవితమంతా విద్య కోసరమే వినియోగిస్తున్న ధన్యజీవి.

స్వామి శివానంద ఆయన చిన్ననాటి మిత్రుడు. దేశ విదేశాల్లో వున్న తన మిత్రులనీయనకు పరిచయం చేసి వారి ప్రేరణతోనే, మహర్షి

అమెరికా, ఐరోపా, జపాను, మలయా, రష్యావంటి అనేక దేశాల్లో దాదాపు ఏడు పర్యాయాలు ప్రపంచ పర్యటనలు చేసి వైజ్ఞానిక, యోగజీవితములు గురించి ప్రబోధించారు. రష్యా సందర్శన సందర్భంలో రష్యనులు ఘనంగా సన్మానించారు. స్వామి శుద్ధానంద వీరిని జన్మతః యోగిగా కీర్తించారు. భగవంతుడెంచుకున్న వార్తాహరునిగా పేర్కొన్నారు. సర్వాంతర్యామి యైన పరబ్రహ్మను సర్వత్రా చూడ కలిగిన మహనీయుడని,యీయన జగన్నాటకాన్ని కన్నులార చూడగల సమర్థుడని జననమరణముల కతీతుడై విముక్తి సాధించిన మహాయోగిగా స్వామి శివానంద వీరిని అభివర్ణించారు.

కాంచనగంగ లోని ఆనందాశ్రమ స్వామి రామదాసు, మహర్షి ఎడల అత్యున్నత భక్తి ప్రపత్తులు ప్రదర్శించి ఆయన మానవాళిని మేల్కొలిపేందుకు అవతరించిన గొప్ప విభూతిగా వర్ణిస్తూ, ఆయన తన దర్శన భాగ్యం పొందవచ్చిన భక్తులపై తన అపార కృపను కురిపించి, ఆధాత్మిక సహాయ మందివ్వ గల సమర్థుడు అని పేర్కొన్నారు.

భారత మాజీ రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాదు ఒక సందేశ మిస్తూ దూరతీరాల్లోని మానవులకు సైతం ప్రేమనందించి, వారి జీవితాలని తేజోవంతం చేస్తున్న మహనీయునిగా శ్లాఘించారు.

"యథార్థ కవి ఏదో మంత్రాంగం నెరిపేందుకే పుడతాడు. నీవు అలాంటి కవివి. అంతః జ్వాలలోని కణాలు నీ మాటలు" అన్నాడు రవీంద్రనాథటాగూరు.

"నీ భారత శక్తిగ్రంథం మరో మహాభారతం" అన్నారు గాంధీజీ. "నీవు వ్రాసే వజ్రాలవంటి గేయాలు, నీవు గడిపే జీవితానికి, నీవు సాధించిన ఆధ్యాత్మిక ఔన్నత్యానికి ప్రతీకలు" అని రోమన్ రోలాండు శ్లాఘించినాడు. ఇంకా జార్జి బెర్నార్డుషా, శ్రీ అరబిందో.

అనిబిసెంటు. ప్రొఫెసరు హఫీజు సయ్యదు మొదలగు మహనీయు లెందరో, వీరిని ఆధునిక మానవోద్ధరణకు అవతరించిన మహా జ్ఞానిగా కీర్తించారు.

శుద్ధానంద భారతి దాదాపు 1500 పుస్తకాలు వ్రాశారు. హిందీ, తెలుగు, తమిళం, యింగ్లీషు, ఫ్రెంచి భాషల్లో 500 దాకా పాటలెన్నో వ్రాశారు. కీర్తనాంజలి, నటనాంజలి, ఉల్కిపట్టు, సింహాసందం వంటి గేయరచనలు బహుళ ప్రచారం పొందాయి. అందులో కొన్ని ఆకాశ వాణిలో ప్రసారం కూడ చేయబడుతున్నవి. వీరి రచనల్లో ప్రసిద్ధి గాంచిన గేయాల్లో, మంత్రమాల, ఉపాసనా గీతాలు కూడా వున్నాయి. 50 నాటకాలు, 100 నవలలు అనేక వ్యాసాలు వ్రాశారు. గీత, ఉపని షత్తులు, వేదాలు, బైబిలు, జెంద్అవిస్త, ఖొరాను, బుద్ధ ధర్మాలు మున్నగు అధ్యాత్మిక గ్రంథాల్ని తమిళం లోనికి అనువదించారు. మెహెర్‌బాబాపై ఎన్నో గేయాలు వ్రాశారు.

ఆరంభంలో ఆధ్యాత్మిక జీవనం పాదుకొనే ముందు రాజకీయాల్లో కూడ విరివిగా పాల్గొన్నారు. తిలక్, గాంధీజీల వంటి నాయకులతో ఆరంభమైన వీరి రాజకీయ జీవనం వారి సాంగత్యంలోనే, షిరిడీలోని సాయిబాబా దర్శన భాగ్యం కలిగి, ఆధ్యాత్మిక జీవనానికి అంకితార్పణ జరిగింది. తిరుచినాపల్లిలో వుండగానే యుగావతారుడు మెహెర్ బాబా దర్శనభాగ్యం కలిగింది. అప్పట్లో బాబా యింకా మౌనం పాటించ లేదు. వారి నోటి మృదు మధుర వాక్కులు విన్న అదృష్టవంతులు. 1954 లో బాబా ఆంధ్ర పర్యటనలో వున్నారు. అప్పట్లో రాజమహేంద్రవరంలో దైవ జీవన సభలు జరుగుతున్నయి. ఆ సభలకు అధ్యక్షత వహించిన శ్రీ మహర్షి బాబాను తాడేపల్లిగూడెంలో కలువగా, బాబా ఆలింగనమిచ్చి: "నీవు నా కోసరం పుట్టావు. నేనెప్పుడూ నీతోనే వుంటాను. నిన్ను అమెరికా పంపుతాను" అని ప్రకటించారు.

ఈ విధంగా ఎందరో మహనీయుల్ని కలియుట వలన వీరిలో సహయోగ సిద్ధి కలిగేందుకు తోడ్పడింది. వయోభారం పడినప్పటికీ, వ్రాయటం, పాడటం అలవాటు చేసుకున్నారు. ఇప్పుడు దాదాపు 105 ఏళ్ళున్నా "నా వయస్సే నాకు పుత్సాహాన్నిస్తోంద"ంటా రాయన. మదరాసు అడయారులో యోగ సమాజ్ స్థాపించారు. దీనికి ప్రపంచ వ్యాప్తంగా బ్రాంచీలున్నాయి. తన పాశ్చాత్య పర్యటన గురించి ముచ్చటిస్తూ మహర్షి, "కర్మ, నన్ను విదేశాలకు తీసుకువెళ్ళింది. నన్ను మళ్ళీ యిక్కడ వుంచేట్లు జ్ఞానం వెనక్కు తీసుకు వచ్చింది. ప్రపంచ వ్యాప్తంగా మానవాళి అణు భయంతో జీవితం సాగిస్తున్నారు. ధూమ్యాకాశాలతో నిండిన యీ జగత్తొక బ్రహ్మాండమైన బోను. సకల మానవులు ఇందులో బందీలు. శాస్త్రం బాగా అభివృద్ధి చెందిన యీ అణుయుగంలో, సామాన్యుడు వీధిలో చిరునవ్వుతో తిరుగుతున్నాడంటే, అది శాస్త్రాభివృద్ధితో సాధించిన సుఖ సంతోషాలకు చిహ్నాం కాదు. అది భౌతిక విజయం కావచ్చును. కానీ మానసిక విజయం మాత్రం ఎంతమాత్రం కాదు" అని తన అభిప్రాయంగా వివరించారు.

విద్యావేత్తగా జీవితాన్ని ఆరంభించిన స్వామీజీ, రెసిడెన్షియల్ స్కూల్సెన్నో స్థాపించారు. గ్రామీణ పునర్నిర్మాణ కార్యక్రమాలు చేపట్టారు. విద్యాలయాలతోపాటు, గృహపరిశ్రమలు, ప్రజా సేవాకార్యాలు, ఆధ్యాత్మిక కేంద్రాలు, యోగాభ్యాస తరగతులెన్నో నడిపారు. అన్ని మతాలు, వేదాంతాలకు సంబంధించిన విషయ పరిజ్ఞానాన్ని, విశేషంగా సముపార్జించిన మహనీయుడాయన. విరామ మెరుగని తన కలం ద్వారా ఆయన మానవాళితో మాట్లాడతారు. ఎప్పుడూ ఏకాంతాన్నే ఆకాంక్షిస్తారు. ఒంటరిగా గదిలో ధ్యానంతో కాలం గడుపుతారు. ఓంకారాన్ని వుచ్ఛరిస్తే చాలు, పరవశులై తొంగి చూసి, యధార్థ అన్వేషకుల అనుమానాలు తీరుస్తారు. దైవమే ఆయనకు మార్గం చూపే తేజస్సు. యోగ సాధనకు వుప

యోగ పడే పురాతన విధానాల్ని, ఆధునిక కాలానికి వుపయోగపడే విధంగా, పునర్వ్యవస్థీకరించారు.

పరిశుద్ధ సాహిత్య ప్రియులకు, శుద్ధానంద భారతి మహాకవిగా, జ్ఞాన యజ్ఞాన్ని ప్రారంభించి, యీనాడు అత్యున్నత త్యాగశీలిగా కీర్తించ బడుతున్నారు. సకల మానవాళి సంక్షేమం కోసరం కృషి చేస్తున్న వీరు, యీనాడు క్షణం తీరికలేని వ్యక్తి. సంసారసాగరంలో మధింప బడుతున్న జీవుల్ని వుద్ధరించి, వారిలో అధ్యాత్మిక పరిణామం కలిగించేందుకు అవిరళ కృషి సలుపుతున్న యోగిపుంగవుడు.

ప్రస్తుతం, తమిళనాడులోని, షోలపురం చేరువలో శివగంగవద్ద స్థిర నివాసమేర్పరచుకొని, సర్వమానవ సమానత్వం కోసరం, దీక్షతో అవిరళ కృషి సలుపుతున్న మహర్షి డా॥ శుద్ధానంద భారతి, బహుభాషావేత్తేకాక, శక్తివంతమైన వ్యక్తిత్వం కల దైవశక్తి సంపన్నులు. ప్రపంచ వ్యాప్తంగా వున్న సకల మానవుల గుమ్మం వద్దకు సమయోగం చేర్చా లన్న ఆయన తపన, దాదాపు అర్థ శతాబ్దిపాటు, యుగావతారుడు అవతార్ మెహెర్‌బాబాతో తనకున్న సాన్నిహిత్య ప్రభావం వలన నెఱవేరగలదని ప్రియతముని కృప వారిపై వర్షించి, తానాశించిన ఆశయ సిద్ధిసాధించటంలో విజయం సాధించగలరని, ఆకాంక్షిస్తున్నాం. 27-4-1985 న యీ మహనీయులు మా మచిలీపట్నం సందర్శించిన శుభ సమయంలో, వారికిదే మా హార్దిక స్వాగత సుమాంజలి.

అవతార్ మెహెర్‌బాబాకి జై !

మచిలీపట్నం
ది. 27-4-85

ఇట్లు
అవతార్ మెహెర్ బాబా సెంటరు

# మౌన ప్రకాశము

ఇది ఒక అపరిచిత కథ. అంత తేలిగ్గా అర్థం చేసుకోలేని ఒక మహనీయునికి సంబంధించినది. ఆయన గడిపిన జీవితంలోని సామాన్య విలువలు, బాహ్యంగా చూచేవారికి పరస్పర విరుద్ధంగా కనపడతాయి. "నే నే దే ము డ్ని" అంటాడాయన. తాను మాట్లాడకూడదని, వ్రాయకూడదని కోరుకున్నాడు. అంతే కాదు-తనను గురించి ప్రచారం చేయించుకొనేందుకు, అనుచరుల్ని కూడ చేరదీయలేదు.

మేల్కొలుపు కలిగి, భగవంతునితో సమైక్యం అవటం గురించి అన్నిమతాలు ప్రబోధిస్తాయి. మేల్కొలుపు అంటే, "నేను" అన్న శాశ్వతత్వాన్ని గుర్తించుట. శాశ్వత మానవ తత్వాన్ని, అనంత విశ్వాత్మక తత్వాన్ని తెలుసుకుని, మానవ దైవంగా జీవించిన వారిని సద్గురువు అంటారు. యీాయన మానవులలో అత్యున్నతుడు. సద్గురువు తన గమ్యం చేరి తక్కిన వారిని, తనంతవారిగా తయారు చేయగల సమర్థుడు. దైవం వైపు చూపుతున్నాడంటే తాను దైవ సాక్షాత్కారం చేయకలిగాడన్నమాట.

అయితే, ఆత్మజ్ఞానం పొంది, ప్రకృతిపై, ఆధిపత్యం సాధించి, సత్యంలో సమైక్యమైన వారిని దైవీమానవుడు అంటారు. ఆయన సద్గురువుకంటే అతీతుడు. మేల్కొలిపేవానిగా దైవం వద్దనుండి వచ్చిన వాడన్నమాట. జీవితంలో నిరంతరం ప్రయాసపడుతూ, భారం మోసుకొని అపజయంపాలై, నిరాశ నిస్పృహ, చెంది సంకోచంతో సతమతమవుతున్న మానవాళికి విముక్తి కలిగించడం కోసరమే భగవంతుడు దైవీమానవుడుగా అవతరిస్తాడు.

దైవత్వంతో కూడిన సందేశాలిస్తేనే తప్ప మన కళ్లతో దైవమానవుడ్ని గుర్తించలేం. పరిణామం, అంతః పరిణామములతో కూడిన పునర్జన్మ విధానపు అవసరం లేకుండానే, తిన్నగా మానవ జన్మ ఎత్తి తానే దైవమన్న ఎరుక గలిగిన వారిని అవతారుడు అంటారు. అవతరించిన దైవమానవుడన్న మాట. తానెవరు ? త న గ మ్య మే ది ? అన్న యీసృష్టి రహాశ్యాన్ని యుగయుగాలుగా భగవంతుడు దైవీమానవునిగా అవతరించిన ప్రతిసారీ మానవాళికి బోధిస్తూనే వున్నాడు.

అసలైన ప్రశ్న ఒక్కటే వున్నది. దానికి అంతిమ జవాబు ఒక్కటే వుంది. అసలు ప్రశ్నకు, అంతిమ జవాబుకు మధ్య అనంతమైన అసత్య జవాబు లుత్పన్నమవుతున్నాయి. అనంతమైన పరబ్రహ్మ పరమాత్మస్థితిలో "నేనెవరిని ?" అన్న ప్రశ్నవుదయిస్తుంది. తత్ఫలితంగా పరిణామదశ మొదలై, అనంత పరిణామ దశ గడిచి, చివరకు అంతంలో, "నేను

భగవంతుడ్ని." అన్న జవాబు వస్తుంది. యీ సత్యాన్ని మానవాళికి ఎరుక పరచటమే అవతారుని మేల్కొలుపు.

మనమిప్పుడు అణు యుగంలో వున్నాం. ఇది రాకెట్టు యుగం. స్పుత్నిక్ యుగం. మానవుడు గ్రహాంతరయానం చేసి, చంద్రమండలంలో కాలూనాడు. శాస్త్ర విజ్ఞానం గ్రహాంతరాళ పరిశోధనలో అభివృద్ధి చెందింది. చేతి బాంబు నుండి, హైడ్రోజను బాంబు వరకు ఎన్నోరకాల మారణాయుధాలు రోజు రోజుకు పెరిగిపోతున్నాయి. భూగర్భంలో అణు పరిశోధన, ఖండాతర వేదికలు, క్షణాల్లో సర్వనాశనం చేయగల మిస్సైలిలు, పెరిగిన మానవ మేధకు, శాస్త్ర విజ్ఞానాభివృద్ధికి ప్రబల తార్కాణాలు. యుద్ధోన్మాదుల శాస్త్ర విజ్ఞానం, మానవునిలోని అహం భావానికి తోడైంది. ఈ నాటి అధునాతన శాస్త్ర విజ్ఞానం, అణు విస్ఫోటక మారణహోమానికి దారితీసి, ప్రపంచాన్ని గడగడ లాడించే వాతావరణాన్ని సృష్టించింది.

ఈ విషాదాంతానికి విరుగుడు అనంత చైతన్యంగల భగవంతుడు మాత్రమే. యినుపయుగమైన ప్రస్తుతం మనమున్న యాంత్రికయుగంలో శాస్త్ర విజ్ఞానం అపారంగా సాధించి, మత మౌఢ్యపు కోరల్లో బందీలై యున్న మానవాళిని, వుద్ధరించేందుకు దైవం, దైవీమానవునిగా దిగిరావలసిన అవసరం ఏర్పడింది. ధర్మోపదేశాల వలన గాఢాంధకారం తొలిగిపోదు. మానసికంగా ప్రబలివున్న మతోన్మాదం, పోరాటతత్వం. సమసిపోయేట్లు చేసేందుకు శాంతికాముకమైన స్వయం శక్తి కలిగిన దివ్య ఆత్మ

అవసరం ఎంతైనా వుంది. శాస్త్రీయ విభాగంలో ఎనలేని అభివృద్ధి సాధించినా మానవాళి మాత్రం, యుద్ధ భయమనే కారు చీకట్లో కొట్టు మిట్టాడుతున్నాడు. ఈ నాడు కావలసింది ధార్మిక సాంప్రదాయాలు కాదు. ప్రేమ కావాలి.

మాటల్తో అందించే బోధలెన్నిటినో యావత్ప్రపంచం విన్నది. బుద్ధుడు ధర్మ మార్గాన్ని గురించి చెప్పి, భూతదయను సదాచారాన్ని నిలిపాడు. జీసస్ క్రీస్తు శాంతిదూతగా ఓర్పు, త్యాగాన్ని యీ జగత్తుకు ఆచరించి చూపాడు. " మీ మార్గమంతా ప్రమాదాలతో చుట్టు ముట్టబడి వున్నది. కనుక యీ చెట్టుక్రిందకు చేరండి " అని మహమ్మదు ప్రవక్త ప్రబోధించాడు. భగవంతుడు వున్నాడన్న స్థితిని గురించిన గీతాబోధను అర్జునుని ద్వారా కృష్ణుడు మానవాళికందించాడు. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణలకు తన జీవితాన్ని అంకితం చేసి, రాముడు జగత్కళ్యాణాన్ని ప్రసాదించాడు. అలాగే సనాతనత్వాన్ని గురించి, ఏకైకుని వునికి గురించిన బోధనల్ని జోరాష్టరు అందించాడు.

సృష్ట్యాదిగా, భగవంతుడు ఎన్నో రూపాలతో, వివిధ నామాల్తో అనేకసార్లు మానవుల మధ్య మానవుడుగా అవతరించి జ్ఞానబోధలు చేస్తూనేవున్నాడు. అయితే అలా వచ్చిన ప్రతిసారీ తాను అవతారునిగా సర్వుల చేత గుర్తించబడవలసిన అవసరం లేదు. కొన్నిసార్లు గుర్తించబడి శ్లాఘించబడుతున్నాడు. చరిత్ర ప్రసిద్ధిచెంది, పురాణపురుషుడుగా చిరస్థాయియై కీర్తించబడినవారున్నారు. సకల మానవాళికి సర్వదా కావలసిన ధర్మనీతి జ్ఞాన

వైరాగ్యాలను బోధించి జగద్గురువులుగా భాసిల్లిన మహనీయు లెందరో ఈ ధరిత్రిపై జన్మించారు. లీలామానుషులై సకల మానవాళికి ఆరాధ్యమై జగన్నాటక సూత్రధారులుగా యావన్మంది మానవ మనసుల్లో శాశ్వతంగా ఉండిపోయారు.

యాంత్రిక యుగపు రోజుల్లో మనం జీవిస్తున్నాం. ఎటు చూచినా కాలుష్యం. వాతావరణ కాలుష్యం. జలకాలుష్యం. శబ్ద కాలుష్యం. యీ కాలుష్యాల వలన ప్రశాంతత నశించింది. ప్రతి వీధి, ప్రతిబజారు మైకుల హోరుతో శబ్దకాలుష్యం విలయ తాండవంచేస్తోంది. కొంచెం లోతుగా ఆలోచిస్తే యీశబ్దానికి కారాణభూతమైన యంత్రాల్ని నడిపే విద్యుత్‌శక్తి మాత్రం ఏ ధ్వని చేయటంలేదు. అంతుపట్టని నిశ్శబ్దం నుండి సూర్యుడు మనం జీవిస్తూన్న యీ ప్రపంచంలో మౌనంతో ప్రకాశిస్తున్నాడు. భూమాత మౌనంగా నవ్వుతూ మొక్కల్ని, వృక్షాల్ని ఫలరస భరితంగా జీవించేట్లు చేస్తోంది. ఆమాటకొస్తే, మౌనంగా అణు శక్తి అవతరించి, యీ అణుయుగాన్ని అధునాతనం చేస్తోంది.

ఇటువంటి యాంత్రికయుగంలో సైతం, మహాజ్ఞానుల ముఖతః మౌనం వుద్భవించింది. వారి మౌనవాణి అంతర్గత వాణియొక్క నిష్పరవ్వలు. మౌనం, ఆధ్యాత్మికంగా శక్తిని పరిరక్షిస్తుంది. అంతర్గత శాంతిని కాపాడుతుంది. ధర్మోపదేశాల వలన గాఢాంధకారం తొలిగిపోదు. ప్రతి ప్రవక్తా, మానవాళిని ఐక్యపరిచేందుకే ప్రయత్నించారు. కానీ వారి అనుయాయులు మాత్రం, సంకుచిత భావాల్తో మతాతత్వం కల్పించి, మానవ

ఐక్యతను విచ్ఛిన్నం పరిచారు. అంటే సందేశాత్మక బోధలు పెడచెవిని పెట్టబడినాయన్న మాట. మానసికంగా ప్రబలిస్తున్న మతోన్మాదం, పోరాటతత్వం, మానవుని గ్రహణ శక్తి కోల్పోయేట్లు చేశాయి. సున్నితమైన ప్రేమవాణి. రణగొణ ధ్వనుల్లో కలిసి పోయింది.

శాస్త్ర విజ్ఞానంలో, ఎనలేని అభివృద్ధి సాధించినా మానవుడు మాత్రం, యుద్ధభయమనే కారు చీకట్లో కొట్టుమిట్టాడుతున్నాడు. భగవంతుడు ఆశాజ్యోతి. యుగయుగాలుగా అలుముకొని వున్న అజ్ఞానాంధకారాన్ని తొలగించే శక్తి ఆయనకే వున్నది. బిగ్గరగా విజిలు వూదితే రైలు కదలదు. రైలుతో ఇంజను కదలాలంటే డ్రైవరు ఆవిరి శక్తిని వదలాలి. అలాగే మానవ మనస్సు, హృదయపు శక్తుల్ని నడిపే డ్రైవరు ఆ దైవమే. పరిమిత మానవ చైతన్యాన్ని పరిశుద్ధపరచి, దైవ చైతన్యం అలవర్చి అనంత స్వేచ్ఛతో మానవుడ్ని తన గమ్యం చేరుస్తాడాయన.

ప్రపంచవ్యాప్తంగా అన్ని మతాలు మౌన విశిష్టతను శ్లాఘిస్తాయి. భగవంతు డెప్పుడూ మౌనంతోనే పనిచేస్తున్నాడనేది సత్యం. మౌనమంటే కేవలం మాట్లాడకుండా వుండటమే కాదు. కోరికలకు, ఆవేశకావేశాలకు, ప్రేమానురాగాలకు సంబంధించి, మనస్సు హృదయాల మధ్య జరిగే సంఘర్షణల యందు కూడ మౌనం వహించకలిగినప్పుడే అది మౌనం అవుతుంది. దాని నాచరించగల శక్తి ఒక్క దివ్యప్రేమకే వుంది. దివ్యప్రేమ ఈర్ష్య ద్వేషాల్ని జయిస్తుంది.

శాస్త్ర విజ్ఞానం ఎంత అభివృద్ధిచెందినా, మానవుని మేధస్సు ఆకాశపుటంచులుదాటి ఖండాంతర తీరాలకు చేరినా మానవుడు మానవుడుగానే వుంటున్నాడు. తననుతాను తెలుసుకో లేని స్థితిలో వుండి, జీవితాన్ని విషపూరితం చేసుకుని అల్లాడుతున్నాడు. జనన మరణములకు బందీయై మళ్లీ మళ్లీ పుడుతూ దుఃఖ భాజనమైన జీవితం నుండి విముక్తి కోరి విలపిస్తుంటే, అపార దయాసముద్రుడైన భగవంతుడు, తన ప్రేమికుల అశ్రుతర్పణంలో తాకనొదై ప్రతిబింబిం చేందుకు మానవుడుగా జన్మ తీసుకుంటాడు. యీ మానవుడ్నే దైవ మానవుడు అంటున్నాం.

కొందరికి ఆయన రాక, గ్రీష్మంలో మలమల మాడ్చే ఎండ తాపాన్ని చల్లార్చుటకు వచ్చిన కారుమేఘంవంటి ఆశీర్వాదం కాగా, మరి కొందరికి గడగడలాడించే చలిలో గడ్డకట్టిన మంచును కరిగించే సూర్య తేజస్సువలె వుంటుంది. మరి కొందరికి, అందరిలా రెండు కాళ్ళు రెండు చేతులు, తదితర సర్వాంగాలూవున్నా, వాటికతీతుడైన సాధుపుంగవునిగా తోచును.

భగవంతుడు ఎప్పుడూ వున్నాడు. అయితే ఆయన కాల ప్రవాహం మనకు అవగాహన కానందున ఆయన రాకపోకలు గురించి మనం అనుకుంటాము. నిజానికా వచ్చుటకు పోవుటకు, ఎక్కడా పోటంటూ లేదు. ఆయన ఎల్లప్పుడూ యిక్కడే మన మధ్యనే వున్నాడు. మూసివుంచిన హృదయకవాటముల బయట తలుపుతటుతూ వుంటాడు. అలా తన వునికి మనకు ఎరుక

పరచుటకు ప్రతి ఏడువందల సంవత్సరములకు ఒకసారి శరీరం దాల్చి మన మధ్యకు వస్తాడు.

ఆయన రావడమంటే, నిజానికి రావడంలేదు. సూర్యుడు వుదయిస్తున్నాడంటే యదార్ధంగా వుదయిస్తున్నాడా ? భూమి తనచుట్టూ తానుతిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతున్నందున, సూర్యుడు వుదయిస్తున్నట్లూ, అస్తమిస్తున్నట్లూ, మనం భ్రమిస్తున్నాం. నిజానికి సూర్యుడు తానున్నచోటునే వుండి, తన వెలుతురును భూమిపై వుండే ప్రతి కణానికి అందించాలని ఎదురు చూస్తాడు.

అలాగే ప్రియతముడగు భగవంతుడు కూడా శాశ్వతంగా తానున్నచోటే మనతోవున్నాడు. శాశ్వతంగా మన హృదయాల లోనే నివశిస్తున్న యీ ప్రియతముడు, ప్రస్తుతయుగంలో మానవరూపధారియై మానవుడుగా జన్మించటం ఒక కథలా జరిగిపోయింది. శోకతప్తులైన మానవాళి నుద్ధరించుటకే ఆయన రాక. జగత్తు యొక్క ఆక్రందనకాయన జననం ఒక జవాబు.

ఈ నాటి సాంఘిక, రాజకీయ, ఆర్ధిక, సామాజిక పరిస్థితులు పరిశీలిస్తే ప్రస్తుత కాలం చిన్నాభిన్నమై పోయింది. వ్యక్తిత్వం నశించింది. యధార్ధవిలువలు కనుమరుగయ్యాయి. అందుకే సనాతనుడైన పరమాత్మ తన సర్వ శక్తులూ వినియోగించి, తన దివ్యప్రేమ, అపారదయలను ప్రసరింపచేసి, సకల జీవకోటని పునరుద్ధరించుటకాయన మానవునిగా జన్మించవలసి వచ్చింది.

అది దేవతలుండే స్వర్గలోకం. రంభా వూర్వశి మేనకాది అప్సరసల కాలి అందెల కింకిణీరవములు ఒక ప్రక్కన, తుంబుర నారదాది మునిపుంగవుల సంగీతరవములు వేరొకప్రక్కన, ఇంద్రాది దేవతలతో కొలువుతీరి వుండవలసిన స్వర్గలోకమానాడు వెలవెల బోతోంది. స్వర్గమంతా అత్యవసరపరిస్థితి ప్రకటించారు. స్వర్గాధిపతి దీర్ఘ సమాధిస్థితిలో ఉన్నాడు. హాహాకారాలు చేస్తూ దేవతలంతా స్వర్గాధిపతియైన భగవంతుని సన్నిధికి పరుగెత్తుతున్నారు. వారి వెనుక భూమాత విచారవదనంతో పరుగిడుతోంది. భూమాత విలపిస్తూ, " అణువిస్ఫోటక మారణహోమం భూమిని దద్దరిల్ల చేస్తోంది. పాపఫలం అనుభవించి తీరాలి. దండన అనివార్యం. దయచూపు. కరుణించు " అని అరుస్తోంది.

ఎన్నో యుగాలుగా దివ్య సమాధిస్థితిలో వున్న భగవంతుడు మేల్కొన్నాడు. చుట్టూ పరికించి చూచాడు. అణు విధ్వంసం జరుగుతోందంటూ దేవతలంతా ఒక్కసారిగా ముక్త కంఠంతో అరిచారు. వుద్వేగంతో వూగిపోతున్న దేవతలను ఓదారుస్తూ శాంతపరచి, " దేవతలారా ! ఎవరీ అభాగిని ? " అని భూమాతవైపు పరికించి ప్రశ్నించాడు భగవంతుడు.

" నాన్నా ? నన్నే మరిచారా ? నేను ధరిత్రిని. మీ కూతుర్ని. యుద్ధోన్మాదులకు నన్ను సమిధగా వదిలేశారా ? భూగర్భంలో అణు పరీక్షలు జరిపే శాస్త్రజ్ఞులకు, మానవ రక్తంతో కలుషితం చేస్తున్న కిరాతకులకు నన్ను బలి చేశారా ? నాన్నా " అని అడిగింది.

" నువ్వా తల్లీ ! ఏమిటీ వైపరీత్యం ? శాంతిదేవతలేం చేస్తున్నారు ? " అని భగవంతుడు ప్రశ్నించేసరికి శాంతిదేవతలు ముందుకు వచ్చి " ఓ ప్రభూ ! భూమిపై శాంతిని పరీక్షిం చేందుకు మేము క్రీస్తుని, బుద్ధుడ్ని, గాంధీని పంపాం. అయితే వారు బిక్క ముఖంతో తిరిగి వచ్చారు. ఒకరు శిలువ వేయబడి నారు. ఒకరికి విషమివ్వబడింది. ఒకరు కాల్చి చంపబడ్డారు. " అని విన్నవించుకున్నారు.

దాంతో దేముడు మరింత ఆశ్చర్యపడ్డాడు. "ఏమాశ్చర్యం ప్రవక్తలు నా సందేశాల్ని మానవాళికి వినిపించలేదా ? నా సత్యం ఏమయింది. ? " అంటూ ప్రశ్నించేసరికి భూమాత అందుకొని " ప్రవక్తలు మీ సత్యాన్ని మానవులకు బోధించారు. అయితే మానవులు అంతంలేని మతాల ముఠాలతో భూమినంతటినీ విభ జించి వేశారు. కర్మ కాండలు మతంపై పెత్తనం చెలాయించాయి డబ్బు కర్మకాండలపైన, రాజకీయాలు డబ్బుపైన పెత్తనం చెలాయిస్తున్నాయి. రాజకీయాలపై శాస్త్ర విజ్ఞానం పెత్తనం చేస్తోంది. అణుశక్తి శాస్త్రి విజ్ఞానాన్ని నిమంత్రణ చేస్తోంది. ఇలా మానవుడు నిత్యజీవితంలో ఎదుర్కొనే ద్వంద్వానుభవాల్లో ఒకదానితో మరొకటి పోటీపడి, స్వార్థచింతన మితిమీరింది ప్రభూ ! " అని విన్నవించింది.

ధరిత్రికి వత్తాసు పలుకు మా దేవతలు కల్పించుకుని, " ప్రభూ ! భూలోకవాసుల సంక్షేమం కోసం, నా సృష్టిలోని మానవకోటికి నీ ప్రేమ సందేశాలందించి, మారణహోమం

నుండి విముక్తుల్ని చేయుటకనువుగా పంచభూతాలు, ప్రమద గణాలు తమవంతు పాత్రను యధాశక్తి నిర్వహించేట్లు కూడ ఆధ్యాత్మిక రీత్యా అన్నిచర్యలు తీసుకున్నా, అక్కడ అతి హేయ మైన రాజకీయ అత్యవసర పరిస్థితి నెలకొల్పి సమస్యల్ని మరింత జటిల పరచారు ప్రభూ ! అణుశాస్త్రవేత్తలు గగన విజయం సాధించారు. ఖండాంతర వేదికలు తయారు చేసుకొని చంద్రమండలంలో కాలూనిన తర్వాత, వారి ఆలోచన లిప్పుడు మనపై కేంద్రీకరించాయి. వారిచూపు మన లోకంపై పడింది." అంటూ తమ ఆవేదన వ్యక్తపరిచారు.

అంతలో భూమాత మళ్లీ అందుకొని, "భూలోకంలో విజ్ఞాన శాస్త్రం సాధించిన అద్భుత విజయాల్తో మానవుడు, రెచ్చి పోతున్నాడు. నూతన సృష్టికి వెంపర్లాడు తున్నాడు. సృష్టికి ప్రతి సృష్టి చేయాలన్న తపనతో విచక్షణ కోల్పోయి చివరకు, స్వర్గాధి పత్యం కోసం సైతం వెనుకాడని పరిస్థితిలో వున్నాడు. మతం పేరిట కర్మకాండలధికమై, వసుదైక కుటుంబం, ఛిన్నాభిన్నమై పోయింది. నిత్యం ఆల్ఫా కిరణాలతో నన్ను దహించి వేస్తున్నారు ప్రభూ" అన్నది.

దేవతలు, ప్రమదగణాలు, భూమాత చేస్తున్న ఆక్రందనలు విన్న పరబ్రహ్మ, స్వర్గంలో అత్యైక పరిస్థిని ప్రకటించాడు. ప్రవక్తలు, శాస్త్రజ్ఞులతో ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేశాడు. క్షణాల్లో ప్రవక్తలంతా సమావేశ స్థలికి అరుదెంచి, సింహాసనారూఢుడైన బ్రహ్మకు ప్రణమిల్లి, వినయ విధేయతలతో సింహాసనానికి నమస్కరించి తమ స్థానాల్లో ఆశీను

వైనారు. పరబ్రహ్మ పిలుపువిన్న శాస్త్రజ్ఞులు, ఎలక్ట్రానిక్ పరికరాలతో పనిచేసే హెలికాప్టరులున్న ఒక జెట్ ఫ్లైటులో దిగారు. మేధాసంపన్నులన్న దర్పం వారిలో ప్రస్ఫుటంగా కనపడు తోంది. నీవు మాకంటే, ఎందులో గొప్పయ్యా ? అన్నట్లున్నాయి వారిచూపులు. "ఏమండీ, ఎందుకు మమ్మల్ని రమ్మన్నారట ?" అంటూ పరబ్రహ్మ ముందున్న ఖాళీసీట్లలో కూర్చున్నారు. వారి అనుచిత వైఖరికి ఉద్రేకం చెందుతున్న పంచభూతాల్ని, దిక్పాలకుల్ని, ప్రమద గణాల్ని, పరబ్రహ్మ ఊరడింపచేస్తున్నాడు. నిశ్శబ్ద వాతావరణం నెలకొన్నది. భగవంతుడు ఓంకార ప్రణవ నాదం చేస్తూ సమావేశాన్ని ప్రారంభించాడు.

ఆది దేవుని సందేశం కొరకు ఇంద్రాది దేవతలు ప్రవక్తలు తితీక్షతో ఎదురు చూస్తున్నారు. అంతలో పరబ్రహ్మ ప్రవక్తలనుద్దేశించి యిలా ప్రశ్నించారు. "నా ప్రియమైన ప్రవక్తలారా ! ఏమి ? వేలకొలది శత్రుశిబిరాలు తయారయ్యేట్లు, మీరు మతాల్ని సృష్టించారా ? నా ప్రియమైన శాస్త్రజ్ఞులారా ! మీరు పరిశోధనశాలల్లో, మారణాయుధాలు తయారు చేసేందుకా నేను మూలపదార్థాన్ని తయారుచేసింది? ఏమిటీ అన్యాయం ?" అన్నాడు.

మతాల తరఫున క్రీస్తు జవాబిచ్చాడు. "స్వర్గాధిపా ! మీయిచ్చ ప్రకారం, మానవోద్ధరణకు పంపబడిన ప్రవక్తలందరం, ప్రేమను, సత్యాన్ని, దయని, అణకువను, మానవాళికి బోధించాం. కానీ అజ్ఞాన ప్రపంచం, వాటిని పెడ

చెవిని పెట్టింది. నన్ను శిలువ వేశారు. నా సోదరునికి విషం పెట్టారు. ఆ మహాత్ముడ్ని కాల్చిచంపారు. మా పేర్ల మీద, మానవులు మతాల్ని సృష్టించారు. ఎన్నో గ్రంథాలు వ్రాసు కున్నారు. సాంప్రదాయాల పేర పోట్లాడుకుంటున్నారు. భూమిపై మేము బోధించేరోజుల్లో విజ్ఞాన శాస్త్రంయింకా పుట్టలేదు. అయితే యిప్పుడది బాగా అభివృద్ధిచెంది, వెర్రి తలలేస్తోంది. వాతావరణాన్ని కలుషితం చేస్తోంది. దానిఫలితంగా పీల్చేగాలి సైతం విషపూరితమైపోయింది. శాస్త్ర విజ్ఞానం యీనాడు ప్రపంచంలో కల్లోలాన్ని సృష్టించి, మానవ మనుగడకు ప్రతిబంధకమైంది. ఎన్నో సంవత్సరాలు కష్టపడి నిర్మించుకున్న సుందర నగరాలన్నీ క్షణాల్లో ఒక్క దెబ్బతో భస్మీపటలం చేయగల మారణాయుధాల్ని మానవుడే నేడు తయారుచేసుకుని విర్రవీగుతున్నాడు " అంటూ యింకా ఏదో చెప్పబోతుంటే, అంతలో ఒక శాస్త్రజ్ఞుడు లేచి మధ్యలో జోక్యం చేసుకుంటూ ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

"ప్రభూ ! నీ కృపావిశేషం చేత అపార శాస్త్ర విజ్ఞానాన్ని మేము సాధించినమాట వాస్తవం. అగ్ని నుండి అణు శక్తి వరకు వున్న ప్రకృతి శక్తిని నేను కనుగొన్నాను. అయితే హింసాయుతంగా, రాజకీయాలు, నన్ను తమ స్వార్థం కోసం బలవంత పెట్టి, యుద్ధం కోసం, మారణాయుధాలు తయారు చేసేట్లు చేశాయి. నేను పరిస్థితుల ప్రభావంపై ఆధారపడ్డ వాడ్ని. ఆ పరిస్థితులు నీపై ఆధారపడ్డాయి కదా ! యిందులో నా తప్పేమీలేదు " అని తన సంజాయిషీ చెప్పుకున్నాడు.

పరిస్థితులు గమనించిన ఆదిదేవుడు, సదస్యుల్ని బృందాలుగా విడగొట్టాడు. సృష్టిలో నెలకొన్న పరిస్థితులపై ఒక వారం రోజులుపాటు చర్చించేందుకు అనుమతించాడు. తమలో తాము చర్చించుకొని, తన ముద్దు బిడ్డల సంక్షేమం కోసం తాను తీసుకోవలసిన చర్యలేమిటో నిర్ణయించమని ఆదేశించాడు. ఆది దేవుని పరోక్షంలో ఇటు దేవతలు, అటు శాస్త్రజ్ఞులు సుదీర్ఘ చర్చలు జరిపారు. కానీ ఏ నిర్ణయానికి రాలేక పోయారు. అణ్వాయుధమారణహోమంలో సమిధలవుతున్న మానవాళి నాదుకొనే తరుణోపాయం స్ఫురించలేదు. ఏకముఖంతో పరబ్రహ్మను ప్రార్థించారు.

"ప్రభూ ! మేము నిమిత్తమాత్రులం. నీవు లీలా మానుష విగ్రహుడవు. దేవాదిదేవుడవు. నీ కృప వుంటేకానీ గాలైనా వీచదు, అటువంటి నీముందు మేమెంత ? ఎంత చర్చించినా యీనాటి మానవుడ్ని వుద్ధరించే ప్రణాళికను నిర్ణయించలేకపోయాం. దివ్య సనాతనుడవు. దీనజనోద్ధరణకు తరుణోపాయం నీవే శలవివ్వవలసింది" అంటూ ప్రార్థించారు.

భగవంతుడు అల్ప సంతోషి. ప్రేమికుల పొగడ్తలకు బందీ అవుతాడు. సదస్యుల దీనాలాపాలకు కరిగి పోయాడు. అందరిలోను జ్ఞానజ్యోతి ప్రతిఫలించేట్లు చేశాడు. దాంతో నును వెచ్చని విద్యుత్తు ప్రతి ఒక్కరిలోను స్పందించేసరికి నిశ్శబ్ద వాతావరణం నెలకొన్నది. మాటలకందని, రాతలకు అంతుపట్టని

భాషలో, వారి హృదయాల్లో ఆది దేవుడు మాట్లాడాడు. తన విరాట్స్వరూపాన్ని వారికి చూపించి, సృష్టి రహస్యాన్ని యిలా ఎరిగించాడు.

“ నేను సనాతనుణ్ణి. జీవించే ప్రతి ప్రాణిని నేను. ప్రాణమే నేను. నా స్వర్గ సామ్రాజ్య పరిధిలో జీవించే సకల జీవకోటిని నేను. సకల సృష్టి నాలోనే వున్నది. నేను సర్వాంతర్యామిని. నేనే మతాన్ని నెలకొల్పలేదు. ధర్మ సాంప్రదాయాల్ని ప్రవేశ పెట్టలేదు. మారణాయుధాల తయారీకి మూలపదార్థాలని నేను సృష్టించలేదు. మానవునికి జీవిత సమరంలో, ఎదురయ్యే సమస్యల్ని తేలిగ్గా సాధించేందుకు, ఆధ్యాత్మిక పురోభివృద్ధికి, అధిక కాలం వెచ్చించేందుకు వీలుగా, ప్రకృతికి అవుసరమైన శక్తిని సృష్టించాను ”

“ దైవత్వంగా మారిన అద్వైతాన్ని నేను ఈ జగన్నాటకానికి సంబంధం లేని సాక్షీభూతుణ్ణి. భూమాతను సశ్యశ్యామలంగా, బంగారు ఖనిజ సంపదలతో తుల తూగేటట్లు, సముద్ర జలాలు, అమృతవర్ష ధారలై కురిసేటట్లు నేను ఎలా చేశానో గమనించండి. నా ధర్మోపదేశాలు సెలయేర్లై ప్రవహిస్తున్నాయి. కాలం, రుతువుల ననుసరించి కలిగే రంగుల సుందరదృశ్యంలో నేనుంటాను. మాటలు లేని నా గీతాల్ని, ప్రకృతియొక్క వసంత శోభలో రాసిపెట్టి చిత్రించాను. అంతర్దృష్టితో నన్ను చూడ కలుగుతారే తప్ప పుస్తకాలవలన నేను గోచరించను .

నేను మనస్సులో ఆలోచనలు రేకెత్తించి, జీవిత గమనం జరిగేట్లు చేస్తాను. కేవలం స్వార్థచింతనలవలన, మత భేదాలేర్పడ్డాయి. కామం, పేరాశ, స్వార్థం, అహంభావం, విశ్వాసఘాతుకం, మున్నగు నవన్నీ దుష్టతలంపుల వలన జనిస్తాయి. నక్షత్రమండలంచూడండి. నక్షత్రాలు నిగూఢమైన ఏదో అద్వితీయశక్తి ప్రేరణతో నిశ్శబ్దంగా పయనించి తెల్లవారే సరికి మటుమాయమైపోతాయి. అలాగే లెక్కలేనన్ని ఆలోచనలతో నిండివున్న మనస్సు, అంతర్గత శాంతిని సాధించి స్థిరపడాలి. అటువంటి ప్రశాంతత ఒక్క మౌనంవలననే సాధ్యపడుతుంది." అని ప్రబోధించాడు పరబ్రహ్మ.

సమస్యకు తాళంచెవి దొరికేసరికి అంతా ఆనందంతో కేరింతలు కొడుతూ, "తండ్రీ ! మాకా మౌనాన్ని ప్రసాదించండి. మానవాళికి మేము ఒక కొత్త తరహా ధర్మబోధని అందిస్తాం" అంటూ ప్రాధేయపడ్డారు. పరబ్రహ్మ వారిస్తూ "త్వరపడకండి. యీనాటి ప్రస్తుతపరిస్థితుల్లో, నోటిమాటల వలన ప్రయోజనం లేదు. మాటలు అపజయంపాలైనాయి. మతాలు మానవుల మధ్య స్పర్థలకు కారణమైనాయి. సిద్ధాంతాలు, సాంప్రదాయాలు, ఆచారాలు, నమ్మకాలు, కర్మకాండలు నిర్వీర్యమై పోయాయి. యీ పాత పద్ధతులతో ప్రపంచం విసిగిపోయింది. ఎంతో అభివృద్ధి చెందిన శాస్త్ర విజ్ఞానాన్ని అంతఃకరణానుసారం, జగత్తుకు నిర్మాణాత్మక మంచిని చేసేందుకు వినియోగించండి" అని శాస్త్రజ్ఞులకు సలహాయిచ్చారు.

అప్పుడు సదస్యులంతా ముక్తకంఠంతో పరబ్రహ్మను కీర్తిస్తూ, "ప్రభూ! మీరు సర్వశక్తిమయులు. ధర్మాన్ని పునః ప్రతిష్ఠచేసేందుకు మీరే సమర్థులు. జీవన సమరంలో నిత్యం అపజయం పొందుతున్న యీనాటి మానవుడ్ని వుద్ధరించేందుకు సరికొత్త పదాన్ని తీసుకురండి. నవమానవాళికి, ఒక ఒక కొత్త పదాన్ని ఒక కొత్తరూపాన్ని, కొత్తశక్తిని అందించండి." అని ప్రార్థించారు.

వారి ప్రార్థనలను మన్నించి, ఆదిదేవుడు, చిరునవ్వు నవ్వుతూ "యీనాడు మాటల్తోపనిలేదు. పారంపర్యరూపంలేదు. అందరిహృదయాల్లోనూ, ఆత్మచైతన్యాన్ని మేల్కొలిపేందుకు, నేను స్వయంగా యిప్పుడు మౌనంతో మానవలోకానికి వస్తాను. దైవసాక్షాత్కారానికి ప్రేమబీజం ముఖ్యం. ఆప్రేమబీజాన్ని నా ప్రేమికుహృదయక్షేత్రంలో నాటేందుకు మౌనావతారునిగా అవతరిస్తాను. దైవాన్ని వివరించడం కష్టం. తన ప్రేమలో తనను తాను మరిస్తేనే దైవంగా జీవించవచ్చును. విశ్వాసనీయులంతా భూమిపైకి వెళ్లండి. నాప్రేమవార్తాహరులుగా వుండండి. నా ప్రేమికులలో, నాచైతన్యాన్ని మేల్కొలిపేందుకు నేను వస్తాను, అని ఆనాటి సమావేశాన్ని ముగించాడు ఆదిదేవుడు.

పరబ్రహ్మ ఆదేశానుసారం, అంతా తమతమ వంతు కర్తవ్యం నిర్వర్తించేందుకు బయలుదేరారు. ఒకమౌన ప్రకాశం స్వర్గంలో వెలిసింది. బ్రహ్మాండమైన జ్యోతిగామారి క్రమంగా భూమి మీదకు దిగింది. ఆ మౌనజ్యోతే అవతార్ మెహెర్‌బాబా.

ఆయన అద్భుత మానావతారం. కులాలు, మతాలు, కర్మకాండలతో సతమతమవుతున్న మానవుడిలో సనాతన ఆత్మ చైతన్యాన్ని మేల్కొల్పేందుకు, అనంతజ్ఞానమనే దివ్య జ్యోతిని పట్టుకున్న సనాతనుడాయన.

ఆయన స్వయంగా తానవతారుడనని ప్రకటించుకున్నారు. 19 ఏళ్ళ చిరు ప్రాయంలో యింకా కాలేజీలో చదువుతుండగా ఆయనలో స్పష్టమైన అవ్యవస్థ ప్రారంభమయినది. మనస్సు చెడిందని తలిదండ్రులనుకున్నారు. అయితే ఆయన మాత్రం జ్ఞానాన్ని కోల్పోలేదు. పంచ సద్గురువుల సమాగమ ప్రాప్తితో కలిగిన సమాధి స్థితివలన, అత్యున్నత చైతన్య భూమికకు చేరి అనంత ఆనందాన్ని అనుభవించటంతోపాటు తన నిజ స్థితిని తెలుసుకోగలిగాడు. ఈ మాయకు అతీతుడని, అంతవరకు తనను గురించి భావించుకున్నదంతా అసత్యమని గుర్తించ కలిగాడు. దాన్నే ఆత్మసాక్షాత్కారం అంటారు.

మెహెర్‌బాబా అసలుపేరు మెర్వాన్ షెరిమార్జీ ఇరానీ. పూనానగరంలో 1894 ఫిబ్రవరి 24 న ఉదయం 5 గంటలకు షెరిమార్జీ ముందేగర్ ఇరానీ, షిరీన్‌ఖానూలను పుణ్యదంపతులకు ముద్దుబిడ్డగా జన్మించారు, వారి యింటిపేరును బట్టి వారుపర్షియన్ లని తెలుసుకోవచ్చును. జ్యోతిష్కులు మెర్వాన్ జాతకం చూసి, అతడొక సద్గురువౌతాడని జోశ్యం చెప్పారు. ఆయన గమ్యం సద్గురు స్థాయిట. ఆయనదొక సాధారణ జననం. జన్మతో ముడిపడిన అద్భుతాలేమీ లేవు. చిన్నతనమంతా సుఖంగానే గడిచి

పోయింది. చిన్నతనంలో ఆయన్నెరిగినవాళ్ళు ఆయన చాలా సౌమ్యుడని, మృదువైన వాడని, స్వార్థ రహితుడని చెప్పేవారు.

ఆయన ఇష్టమైన దర్శనీయ స్థలాలు, మహమ్మదీయ గోరీల దొడ్లు పార్శీల శాంతి స్థూపాలు, గంటల తరబడి ఏకాంతంగా అక్కడ గడిపేవారు. ప్రకృతి సౌందర్యోపాసకుడు, సంగీతమంటే ఆనందించేవారు. షేక్స్పియరు, వర్డ్స్వర్తు షెల్లీ, మున్నగు గొప్ప రచయితల కవితలు ఇంగ్లీషు, భారతీయ పర్షియన్ భాషల్లో చదివేవాడు. బాబా చరిత్ర చదివితే మనకు అర్థమయ్యేది – ఆయన ఎక్కువకాలం వుపవశించేవారు. అధిక కాలం వుపవశించే రోజుల్లో ఏకాంతవాసం కూడా గడిపేవారు. వీటిని దైవచింతనకో ధ్యానానికో కాక, తన కార్యక్రమం కొరకు పాటించేవారు. ఏకాంతంలోనే భారత ఉప ఖండమంతా రైళ్ళల్లో, కార్లలో బస్సుల్లో, కాలి నడకన పయనించి, పవిత్ర క్షేత్రాలెన్నో సందర్శించారు. ఏకాంతంలో ఆస్ట్రేలియా, అమెరికా దేశాలు కూడా పర్యటించారు.

సాధారణంగా మానవులు మహాత్ములు కోరుకుంటారు. అయితే ముందు బాబాను ఒక మానవునిగా అంగీకరిస్తేనే కానీ, యితర విషయాల్లో ఆయన్ను గురించి అంగీకరించలేము. ఆయన మనకోసరం వచ్చి ఉండకపోతే, మానవుడుగా మానవ చైతన్యం లేకపోతే యీ పరిమితుల్ని వివరించటం సాధ్య పడదు. మానవుడుగా మెహెర్‌బాబా ఒక సద్గురువు. ఆయన తెలివితేటలు పెంచుకొనో, చదువుకొనో, సహజ ప్రవృత్తితోనో

సద్గురువు కాలేదు. మాయ తొలగిపోయి మేలుకొలుపు కలిగి భగవంతునితో సమైక్యం కావటాన్ని అన్ని మతాలు ప్రబోధి స్తాయి. సద్గురువులు " నేను " అన్న శాశ్వతతత్వాన్ని గుర్తిస్తారు.

పునికికి అతీతమయిన వాడు భగవంతుడు. " నేను దైవాన్ని " అని బాబా చెప్పారంటే తన శూన్యత్వాన్ని చెప్పు కున్నట్లే కానీ, గర్వంగా చెప్పుకున్నట్లు కాదు. " నేను సర్వో న్నతుణ్ణి " ని చెప్పటమే కాక " అధముల్లో అధముణ్ని " అని ఆచరణలో చేసి చూపారు. తన ఔన్నత్యాన్ని కానీ గొప్ప కానీ, చెప్పుకొనేవారు కాదు. తన దగ్గరకు వచ్చే వాళ్ళతో బాబా "మీరు దేవుళ్ళనని తెలుసుకోగలగితే మీరూ దేవుళ్లవ్వగలరని" చెప్పేవారు.

ఆయన కేవలం సద్గురువేకాదు. తానే స్వయంగా అవతారు ణ్ణని ప్రకటించుకున్నారు. మహిమలు చేయటం, అద్భుత శక్తులు చూపటం వంటివి దైవ ప్రేమముందు విలువలేనివి. అవి పరిశుద్ధ ప్రేమకు ఋజువు కాబోవు. అందుకే బాబా ఎటువంటి స్వార్థం, కల్తీ కలవకుండా పరిశుద్ధ ప్రేమను మాత్రం అందించారు.

దైవం మానవుడుగా దిగి రావటాన్ని అవతరణ అంటారు. అవతారుడు తాను దిగి రావటాన్ని ఎరుక కలిగి ఉంటాడు. అవతారుడు అంటే కేవలం దైవం యొక్క ప్రత్యక్షీ కరణ కాక దైవం ప్రత్యక్షమవట మన్నమాట. భగవంతుడు

శరీరధారిగా మారటం నిజానికి అందరూ ఒక విధంగా అవతారులే. కానీ మానవులంతా పరిణామ దశలో ఆరోహణ క్రమంలో వుండుటవలన తమ అవతార తత్వాన్ని ఎరుగలేకున్నారు.

కృష్ణుడు మానవ రూపంలో దైవంగా అవతరించాడని గీత బోధిస్తున్నది. హిందూమతం ప్రకారం చాలామంది దేముళ్లున్నారు. వారు మానవులై, మానవులమధ్య మానవులుగా అవతరించి, మానవుల్ని వుద్ధరిస్తారని విశ్వశిస్తారు. క్రైస్తవులుకూడ భగవంతుడు మానవరూపధారిగా అవతరిస్తాడని నమ్ముతారు. దృశ్య జగత్తులో బంధితులైన మానవాళి నుద్ధరించేందుకు భగవంతునిరాక అవసరమున్నదని మనం యింతకు ముందే చెప్పుకున్నాం. పంచసద్గురువులున్నప్పుడల్లా ఆయన పునర్దర్శన మిస్తూనే వుంటాడు. మొదటి రక్షకుడాయన. ఆయనఎవరో, ఎప్పుడు కనపడతాడో ఎవరికీ తెలియదు. చరిత్రకందని అవతరణ ఆయనిది. ఆయన లేకపోతే చరిత్రే లేదు. ఒకే భగవంతుడు అవతారుడుగా మాటిమాటికీ భిన్న ప్రదేశాల్లో, భిన్న రూపాల్లో వివిధ నామాల్తో అవతరిస్తాడని మెహెర్‌బాబా చెప్పారు.

మెహెర్‌బాబాని దైవమానవునిగా గుర్తించడం ఆయన్ని మానవునిగా ఆలోచించడంపై ప్రభావితమవుతుంది. ఆయన జీవితాన్ని గమనిస్తే దైవస్వభావంలో దైవమానవుడుగా, అనంతశక్తి అనంతజ్ఞానం, అనంత ఆనందాల్ని కలిగివున్నట్లు, అవగతమవుతుంది. ఆయనలోని మానవ స్వభావం తనను

విశ్వాత్మక నిస్సహాయతను, బాధల్ని అనుభవించేట్లు చేయుటను స్పష్టంగా గమనించవచ్చును.

అనూహ్యమైన కారణాల వలన, ఆయన 1925 జూలై 10 నుండి మౌనం పాటించారు. మొదట్లో కాయితం, పెన్సలు పలక-బలపం వుపయోగించి తన భావాల్ని వ్యక్తపరిచేవారు. మరో 18 నెలలు గడిచాక 1927 జనవరి 2న వ్రాయటం కూడ మాని వేశారు. ఆరంభంలో సౌంజ్ఞలు చేసేవారు. కాని వెంటనే ఇంగ్లీషు అక్షరాలున్న ఫలకాన్ని వాడేవారు. సమావేశాల్లోను, సందర్శకులు వచ్చినప్పుడు ఆయన అక్షరఫలకాన్ని వుపయోగిస్తుంటే, మండలి లోని ఒకరు పదివి వినిపించేవారు. ఇలా 1954 అక్టోబరు7 వరకు దాదాపు 29 సంవత్సరాలపాటు జరిగింది. దరిమిలా యీ బోర్డును కూడ త్యజించారు.

ఆ తర్వాత సౌంజ్ఞలతో భావప్రకటన చేశేవారు. యీ సౌంజ్ఞల్ని మండలిలో కొందరు సునాయాసంగా మాటల్లో తర్జుమా చేసేవారు. బాబా మౌనానికి, వ్రాయటం మానటానికి ఏమైనా సంబంధం వుందేమో తెలియదు. వ్రాయటం మాట్లాడటం ఆయన ఎందుకు మానేశారో సరిగ్గా వివరించలేదు కానీ, మౌనానికి మౌనమే జవాబన్నది కటిక సత్యం. మామూలుగా మౌనం, క్రమశిక్షణను సూచిస్తుంది. స్వయంస్మృతి వుండేందుకు వుపయోగపడవచ్చును.

తూర్పు దేశాల్లో మౌనానికి ఆధ్యాత్మిక శిక్షణలో సంకేతంగా గుర్తింపు వుంది. వయోవృద్ధులైన శిష్యుల ప్రశ్నలకు, యువకుడైన గురువు జవాబు మౌనం. యుగయుగాలుగా

మౌనం పాటించటం ఒక అలవాటు. "నిబ్బరంతో నన్ను భగవంతునిగా తెలుసుకొనుడు" అని ప్సాలమిస్టు అన్నాడు. "తననుతాను తెలుసుకోగలిగినవాడు మాట్లాడడు" అని లావోట్జీ అన్నాడు. బుద్ధుడ్ని శిష్యుని విధేమిటో చెప్పమన్నప్పుడు మౌనంగా వుండిపోయాడు. జీసస్ క్రీస్తు జీవితం దాదాపు 32 ఏళ్లు మౌనంతో గడిచి పోయింది. ఆ తరువాత కూడ ఆయన మౌనం పాటించి నట్లు ఆధారాలున్నాయి. "నేను మౌనంతో వున్నాను కనుక, నాకు మాట్లాడే అలవాటు లేద" న్నాడు ప్లోటినస్.

1954 లో బాబా తన అక్షరఫలకవిసర్జన చేయబోయే ముందు, మౌనం గురించి ఎక్కువగా వివరించారు. అంతకు ముందెన్నడూ మౌనంపై అంతగా మాట్లాడలేదు. 1952 లో బాబా ఏప్రియల్‌లో ఒకరోజున యిలా చెప్పారు. "భగవంతుడు శాశ్వతంగా, ఎల్లప్పుడూ మౌనంతోనే పనిచేస్తున్నాడు. ఆయన అనంతమౌనాన్ని అనుభవించగలిగినవారు తప్ప తదితరులెవరూ ఆ మౌనాన్ని గుర్తించటంకానీ, వినటంకానీ చేయలేరు. నా మౌనమే మాట్లాడ లేనప్పుడు, నోటి మాటలతో ఇచ్చే వుపన్యాసములు వలన వుపయోగమేమి కలుగుతుంది" అన్నారు.

1954 లో బాబా ఆంధ్రప్రదేశ్‌లో పర్యటించినప్పుడు, "నేను మాట్లాడేమాటల్ని, విశ్వాత్మకంగా వినకలగాలనీ, భగవంతుడు తలచినప్పుడు, ఆయనే నన్ను మౌనవిరమణ చేసేట్లు చేస్తాడని" ప్రకటించారు. నేను నా మౌనవిరమణ సమయం, స్థలంగురించి నా అనుచరులకైనా చెపుతానా? అని

కొందరు నన్ను ప్రశ్నించారు. ఇది ఎంతో హాస్యాస్పదం. అలా అడగటంలోనే వారు నా మౌన విశిష్టతను సరిగా అర్థం చేసుకో లేదని విదిత మవుతుంది." అన్నారు.

"నేను అనంత కాలంగా, మీ అందరిద్వారా సంభా షిస్తూనే వున్నాను. మీ అందరి రూపాల్లో, విడవకుండా కొనసాగే సంభాషణల వలన కలిగిన విసుగునుండి హారట కలిగేందుకు, నేనీ వ్యక్తిగత రూపంలో మౌనం వహించాను. వుపన్యాసాలు, సందేశాలు, ప్రకటనలు, ప్రవచనాలు, అవి ఆధ్యాత్మికమైనవి కానీ, మరేవైనాకానీ, మాటలద్వారా, రాతలద్వారా సూచించటం వలన, అవి యితరులపై పనిచేయనప్పుడు, సజీవంగా వారి మనసులపై ప్రభావితం చేయలేనప్పుడు, అవి కేవలం వ్యర్థ ప్రసంగాలే అవుతాయి."

వేరొకసారి "నేను మౌనంగాలేను, సౌంజ్ఞల ద్వారా, అక్షరఫలకంద్వారా, ధారావాహికంగా మాట్లాడుతూనే వున్నాను" అన్నారు. ఆయన సమక్షంలో మెసిలేవారికి మౌనంతో సంభా షిస్తున్నట్లు అనుభూతి కలిగేది. ఆయన చేసే సౌంజ్ఞలు, మాటలకు అతీతమైనవి. వాటికి మాటలతో పనిలేదు. బయటకు వినపడకుండా, హృదయం నుండి హృదయానికి వినపడే నిశ్శబ్దమది. అప్పుడప్పుడూ ఆయన యితరులతో ముచ్చటించే టప్పుడు, వారు వివిధ భాషలవారైనప్పటికీ, వారెరుగని భాషను తానాసౌంజ్ఞలలో వుపయోగిస్తున్నట్లు గుర్తుచేసేవారు. అంటే

తమకా భాష రాకపోయినప్పటికీ, సౌంజ్ఞల్లో ఇచ్చే సందేశాన్ని వారు అర్థం చేసుకోగలుగుతున్నారన్నమాట.

బాబా స్వయంగా వ్రాసిన ఏ పదమూ అచ్చువేయకండా వదలలేదు. ఆయన నోటితో పుచ్ఛరించని పదాలెన్నో ఆయన రాతలుగా చేతి సౌంజ్ఞలు, అక్షరఫలకం ద్వారా సూచించినప్పుడు అవన్నీ గ్రంథస్థం చేయబడ్డాయి. కృష్ణుడు వ్రాసిన రాతలులేవు. ఎక్కువగా మాట్లాడిన బుద్ధుడు ఏమీ వ్రాయలేదు. జీసస్ వ్రాసిం దసలేలేదు. సోక్రటీసు అధికంగా మాట్లాడాడేకానీ, ఏమీ వ్రాయ లేదు. వారు చేసిన బోధలు, వారు గడిపిన జీవితంలోని విశిష్ట తను చాటాయి.

బాబా విశిష్టతంతా ఆయన రాతల ద్వారా కాక, ఆయన పాటించిన మౌనం ద్వారా ప్రకటిత మయినది. అక్షర ఫలకాన్ని వుపయోగించేటప్పుడు బాబా పదాలెలా వుపయోగించేవారో గుర్తుంచుకోవటం అవసరం, ఆయన మాట తరువాత మాట చెప్పేవారు కారు. ఆయన చూపే మొదటి అక్షర క్రమాన్ని బట్టి ప్రవచనాన్ని శిష్యులు తయారు చేసి, ఆయనకు చదివి వినిపించేవారు. ఆ తర్వాత అయన మార్పులు చేర్పులు అవసర మైతే చేయించి ఖాయపరచేవారు.

అక్షర ఫలకంపై తయారు చేయించిన ప్రకటనలు ప్రవచనాలేకాక దాని విసర్జన తరువాత చేతి సౌంజ్ఞల ద్వారా తయారు చేయించిన అతి ముఖ్య ప్రకటనలెన్నో యీ విధంగానే తయారు చేయబడినవి. నిజానికిది ఎంతో కష్టతరమయిన పని.

ప్రతి ప్రకటనను "బాబా చెప్పారు" అనటంలో ఆయన తరఫున మరొకరు మాట్లాడుతున్నట్లు విశదమవుతుంది.

చాలాసార్లు తాను మౌన విరమణ చేస్తానని చెప్పారు మౌనం ప్రారంభించిన రెండేళ్ళకే 1927 లో తాను ఐదు రోజుల్లో మాట్లాడబోతున్నట్లు చెప్పారు. కానీ మాట్లాడలేదు. 1932 లో హాలీవుడ్‌లో వుండగా మాట్లాడబోతున్నట్లు వాగ్దానం చేసినా మాట్లాడలేదు. 1941 లో మళ్ళీ యిలా చెప్పారు. "1-8-41 న నేను మాట్లాడుతాను. అనాడు, నాలో నేనే, దైవేచ్ఛ ప్రకారం, దైవవాక్కును వుచ్ఛరిస్తాను. ఇలా నాలో నేను వుచ్ఛరించే కార్యక్రమం 15-2-1942 వరకూ కొనసాగుతుంది. ఆనాడు విశ్వాత్మకంగా బాహ్యంగా మాట్లాడుతాను." అని ప్రకటించారు.

తనలోతాను మాట్లాడుకోవటం అనేదాని భావమేమిటో వివరించలేదు. 1942 - ఫిబ్రవరిలో మాటాడనూ లేదు. రంజూ అబ్దుల్లా ఒక సంఘటన చెప్పాడు. ఒక రోజున బాబామండలిలోని కొందరు శిష్యుల్ని వెంటబెట్టుకొని చాలా దూరం నడిపించుకొని వెళ్ళి, ఒక ఏకాంత ప్రదేశంలో ఆగారు. వారిని, తన చుట్టూ 50 అడుగులు దూరంలో, వీపులు తనవైపు వుంచి నిలబడమన్నారు. వారి మధ్యగా, ఆయన నిలబడ్డారు. తాను చప్పట్లు కొట్టినప్పుడు, వారు తనవైపు తిరిగితే వారితో మాట్లాడతానన్నారు.

అలాగే ఆయన చప్పట్లు కొట్టగా, వారంతావెనుతిరిగి చూచినా, ఆయన ఏమీ మాట్లాడలేదు. వారికేమీ వినపడలేదు.

చిరునవ్వుతో వారిని చెంతకు పిలిచారు. మీరేల మాట్లాడలేదని వారు అడుగగా "నేను ఎప్పుడూ మాట్లాడుతూనే వున్నానని మీకు తెలియదా ?" అని ఎదురు ప్రశ్న వేశారు. "మీలో యిప్పుడు కలిగిన. సహజ జ్ఞానధ్వనే నా శబ్దం" అన్నారు. బాబా వుద్దేశంలో పదముచ్చరిస్తేనే మౌనవిరమణ అనుకుంటే అది అజ్ఞానం.

ఆయన తన మౌనవిరమణ గురించి వివరిస్తూ, తాను మౌనం విరమించినప్పుడు పలికే ఏకైక పదం, "ఒక వేదాంతి నుండి ప్రపంచానికి వినపడే పదంవలెకాక, దైవం నుండి వెలువడి, తిన్నగా హృదయాంతరాళంలో హత్తుకు పోతుంది" అన్నారు. మరి ఆ పదాన్ని ఆయన వుచ్చరించారో లేదో మనకు తెలియకపోయినప్పటికీ, రానున్న 700 ఏళ్ళవరకూ అది ప్రతి స్పందిస్తూనే వుంటుందని బాబా అన్నారు.

మరో పర్యాయం, నేనుచ్చరించే ఆ పదం, సముద్ర ఘోషలాఓంకారంతో వుంటుందన్నారు. "అన్ని రూపాలు, అన్ని పదాలు, అసలు పదమైన ప్రాథమిక ధ్వనినుండి వెలువడ్డాయి కనుక, విడవకుండా దానితో సంబంధంపెట్టుకొని జీవించటంవలన, నేనా పదాన్ని వుచ్చరించినప్పుడు, సకల జీవకోటి, నేను మౌన విరమణ చేసినట్లు తెలుసుకుంటారు. ఆ పదాన్ని నేనేపలికినట్లు తెలుసుకో గలుగుతారు" అన్నారు. దీనిభావాన్ని ఎవరికివారు తమలో వున్న గ్రహణ శక్తినిబట్టి మాత్రమే గ్రహించగలరు.

పదమనేది అంతర్గతంగావుండేది. అంతర్ చెవితో వినకలిగినవారికే వినబడుతుంది. కొలవ శక్యంకాని దైవ జీవనం గడిపేవారే ఆ పదాన్ని వినగలరు. 1962 నవంబరులో తన మౌనవిరమణ తదుపరి మామూలు విధానంలో మాట్లాడనని ఒకసారి చెప్పారు. తాను మాట్లాడటం, తన స్పష్టీకరణ రెండూ ఒక్కటేనని మరోసారి పూనాలో చెప్పారు. దాన్ని తన భాషలో చెప్పారో, మనభాషలో చెప్పారో, దాని భావమేమిటో, మనకు అవగతం కాదు.

మొదట్నించీ తాను గురువునుకాదని చెబుతూ వుండేవారు. ఇతరులను తమ గమ్యం చేర్చటమే తన పని అని చెప్పేవారు. అందరితో కలిసి మెలిసి, అందరికోసం ప్రపంచంలో జీవిస్తున్నానే కానీ, ప్రపంచంకోసం జీవించటం లేదన్నారు అటువంటి కార్య క్రమాన్ని ఆయన మౌనంతో ఆచరించారేకానీ, బోధల్తో గ్రంథస్తం చేయలేము. శాశ్వతంగా వుండే, చెడిపోని మాధుర్యం అందరిలోను వుంటుంది. ఎవరైనాసరే తప్పకుండా తనలోనే వున్న అనంతానంద మహాసాగరాన్ని కలిసి తీరాలి. నేను, నాదన్న పరిమిత ద్వంద్వభావాల్ని విడనాడాలి. ఈ ద్వంద్వాల్నుండి విముక్తి కలిగితేనే తప్ప, ఆ శాశ్వత మాధుర్యం బహిర్గతపడదు.

"అయినా నేను చెబుతున్నాను ఆశపెట్టుకోండి. నమ్మకం కలిగి వుండండి. అప్పుడే మీరు ఋణవిముక్తులవుతారు. ఈనాటి మానవునికి పొంచివున్న ప్రమాదం తననుండే. పేరాశ, స్వార్థముల యొక్క విషపుకోరలనుండి మానవ చైతన్యాన్ని మరల్చండి. దేముడ్ని ప్రేమించండి" అని హితబోధ చేశారు.

చూడతగిన నిధియగు దైవాన్ని మనలోనే చూడాలి. బొమ్మల్ని చూచి, పట్టణాన్ని గురించి చదువుకుంటే, పూర్తి అవగాహన కుదరదు. ముందుగా అక్కడకు వెళ్ళి కొన్నాళ్ళుండి చూడాలి. కేవలం పుస్తకంద్వారా ఏమీ అవగాహన కాదు. ఆత్మ యొక్క శాశ్వతానందం అందరిలోనూవుంది. ఎవరైనా సరే బాబా కార్యక్రమం చేయడమంటే, ప్రేమమయ జీవితం గడపటమన్నమాట. తన ప్రేమికుల ఎడల బాబా ప్రేమ ఎల్లప్పుడూ వుండి, సహాయపడుతూ, మార్గదర్శిగా వుంటుంది.

మానవాత్మ అనేపక్షి, ద్వందాలనే మానశిక పరిమితుల పంజరంలో బంధించబడి వున్నది. ఆ పంజరాన్ని తెరిచి బంధితుడ్ని ఏ విశాలమైన తోటలోనో, వున్నత స్వర్గంలోనో వదిలి, స్వేచ్ఛకలిపింపగలశక్తి ఆయనకే వున్నది. ఆయన ఒక ఓర్పుగల చిత్రకారుడు. మానవ సృష్టికి అందానిచ్చేట్లు కుంచతో రంగులు వేయగల సమర్ధుడు. ఆయన అందరికీ వంగి ప్రణామములర్పించేవారు. అందరికీ భోజనం వడ్డించేవారు. అందరినీ ఆలింగనం చేసుకొనేవారు. అందరిలోనూ తననే చూచేవారు. తన ప్రేమికులతో ఆత్యాపాత్యా, గిల్లీదండా ఆడేవారు. క్రికెట్టు గోళీకాయలాటలంటే మహాయిష్టం. ఆ దే స మ యం లో వారి హృదయంతో నమ్మకము, గౌరవప్రపత్తులతోపాటు, నోటి మాటలతో చెప్పనలవికాని, భక్తి, ప్రదేశాల్ని వెలిగించేవారు.

ఆదీజీని చూడండి, యీరుచ్‌ని చూడండి. మణీ మెహెరాల్ని చూడండి – ఆంధ్రుల్ని చూడండి. బాబా ఎడల వారికున్న నిష్కళంక ప్రేమ చెప్ప శక్యము కానిది. తమ ప్రాణాలసైతం

అర్పించేందుకు వెనుకాడని ధీరులు. బాబా వచ్చింది మన హృదయాల్లో ప్రేమ బీజాల్ని నాటేందుకే. ఆయన పాత బాకీలైన కర్మకాండలతో కూడిన, ఆచార వ్యవహారాల్ని పాటుగొల్పలేదు. ఆయన మానవాళిని మేల్కొలిపి సహజ దివ్యత్వానికి చేర్చేందుకే మన మధ్యకు వచ్చారు. " ప్రేమలో ఏకత్వం " యిదే మౌనపు విశిష్ట సందేశం.

బాబా మన మధ్యకు సంపద, పిల్లలు, దీర్ఘ కాల జీవితం మున్నగు వరాలిచ్చేందుకు రాలేదు. నాదంటూ ఏమీ వుంచుకోకుండా, సమస్తం ఆయనకు సమర్పించుకుంటే తనను తానే సమర్పించుకుంటానంటాడు. ఆయన హృదయ సామ్రాజ్యాధిపతి. లక్షలు పుచ్చుకున్నాడు. లక్షలు యిచ్చాడు. ఇంద్రభవనాల్లో వున్నాడు. నిరుపేదల గుడిశల్లోనూ వున్నాడు. అయితే తనకంటూ ఒక్క సమాధి తప్ప మరేమీ మిగుల్చుకోలేదు, తన స్వంత సమాధిని తాను స్వయంగా నిర్మించుకున్నారు. భ్రష్టత్వం కలిగించే ధనానికతీతుడాయన. ఎవరైనా కానుకలు సమర్పిస్తే తిరస్కరించేవారు.

తాను అతిసామాన్య భోజనం చేస్తూ, తన ప్రేమికులకు మృష్టాన్న భోజనం పెట్టేవారు. సాహవాస సమయాల్లో లడ్డూలు, మామిడిపళ్ళు పంచిపెట్టేవారు. తాను మాత్రం పప్పూ అన్నం తినేవారు, " వ్యధ చెందకండి - సంతోషంగా వుండండి " అని చెప్పిన ఆధునిక యోగి మెహెర్ బాబా. డబ్బూలేదు. పూజాది కాలసలే లేవు. ఆయన పరిపూర్ణ సన్యాసం చేసిన మహాయోగి.

కోటీశ్వరులు, రాజలాంఛనాలతో విలువైన దుస్తులు ధరింపచేసి, బంగారు ఆభరణాలుతొడిగి, వజ్రవైఢూర్యములు పొదిగిన సింహాసనంపై కొలువుంచేందుకు ముందుకు వచ్చారు. కానీ వాటిని తృణప్రాయంగా తిరస్కరించి, కేవలం రెండు చింకి కోట్లు, తెగిపోయిన పాదరక్షలు మాత్రం వుంచుకున్న రాజర్షి ఆయన. ఆయన సరళ స్వభావి. పేరు ప్రతిష్ట కావాలనికానీ, తనపేరుమీద ఓ మతాన్ని స్థాపించాలని కానీ అభిలషించలేదు. అవిభాజ్యమైన మానవాళి కాయన ఒకవార్తాహరుడు. నవయుగ వైతాళికుడు.

బాబామతం హృదయమతం. ఆత్మజ్ఞానానికి సంబంధించిన మతమాయనిది. ప్రేమకు ప్రతీక మెహెర్‌బాబా. అంటు, ముట్టు భేధం లేకుండా, పేదా బిక్కీ తారతమ్యం లేకుండా, అందర్నీ ఆలింగనం చేసుకున్న మహనీయుడు. స్త్రీ పురుష భేదంలేదన్నాడు. మూర్ఖులకు, పిచ్చివాళ్ళకు, మస్తులకు, కుష్టురోగులకు ఆశ్రమాలు నెలకొల్పారు. వారందరిలోనూ భగవంతుణ్ణి చూచిన మహాత్ముడాయన. సమదృష్టి, విశ్వాత్మక మంత్రాంగం నెఱపిన ప్రియతముడాయన.

ఆయనది బహుసామాన్య జీవితం. నమ్రత, పరిశుద్ధతలు, పాలు-తేనెవలె కలగలిపిన అపార దయా సముద్రుడు. లక్ష లాది మంది ఆయన పాదస్పర్శకోసం తహతహలాడితే తాను మాత్రం నడిరోడ్డని కూడా చూడకుండా, కటిక దరిద్రుని పాదాలు కడిగారు. ఎన్నో లక్షల మంది ఆయన పాదపూజ చేశారు.

పాదాలకు అభిషేకం చేశారు. అగరొత్తులు వెలిగించి, హారతి యిచ్చారు. అయితే మన ప్రియతమబాబా ఒక కుష్టురోగికి, అందునా కటిక దరిద్రుని పాదాలు నడిరోడ్డుపై కడిగి, తన శిరమును వాటిపై వుంచి, ఆ రూపంలో కూడ దైవం వున్నాడని తెలియచేసేందుకు నమస్కరించారు.

ఇంతటి మహోత్కృష్టమైన అనుభూతి ఎన్నిపుస్తకాలు చదివినా, వుపన్యాసాలు విన్నారాదు. కనపడకుండా దాగివున్న మాయతెర, "నేను" "నాది" అన్నభ్రమ ఆయన ఆలింగన ప్రాప్తితో పటాపంచలై పోయేవి. వారందరిలోను, తానొక్కడే అద్భుత ఆత్మగా వుండేవారు. ఈ జగత్తంతా అపరిపూర్ణత్వంలో నిండి యుండుటవలన, అవతారుని శరీరం యీ అపరిపూర్ణత్వాన్ని పంచుకోవలసి వస్తుంది. యీ సత్యాన్ని ఆయన ఎరుకతో వుంటాడు కనుక ఆయన శరీరం మనశరీరాలకు భిన్నమైంది. పైకి చూడటానికి ఒకేలాగ కనపడుతుంది. శీతోష్ణస్థితులకు, వ్యాధులు ప్రమాదాలకు అతీతంగా వుండక, వాటికిలోబడే వుంటుంది.

ఆయన కళ్ళు భావప్రకటన స్పర్శ, పడక, శారీరక స్థితి, మానసిక స్థితి, చేతులు వుపయోగించడం, యివన్నీ ఒక ప్రత్యేకత కలిగి తన స్వంత రీతిలో వుండేవి. ఆయన సమక్షంలో వున్నప్పుడు, ఆయన చేతలు ఆయనలో ఏవో అద్భుత శక్తులున్నట్లు గానీ, లేదా కావాలని ఏదో ప్రభావం ఆయననుండి పుడుతున్నట్లు, అనిపించదు. ప్రశాంత వాతావరణం అనూహ్యమైన

వుత్తేజం కలిగిస్తుంది. కొత్తదనమనిపించేది కాదు. ఒక అపరి చితుని కలిసినట్లనిపించేదికాదు. ఆయనను చూచినకొద్దీ చూడాలనిపించేది. మనస్సుపై చెరపలేని స్థిర ముద్ర వేసుకొనేది.

బాబాను దర్శించడం అంటే ఆయన, ఏర్పాటు చేసిన దర్శన కార్యక్రమాలకు వెళ్ళి చూచి రావటంకాదు. సర్వకాల సర్వావస్థలయందు ఆయనను మనసా, వాచా, కర్మణా జ్ఞాపకం ఉంచుకోవాలి. ప్రతి పనియందు, ప్రతి మనిషిలోనూ, ప్రతి పదార్థమందు, ప్రతి వస్తువులోనూ బాబాను చూడకలిగేంతగా ఆయనను ప్రేమించాలి. ఆయనకు కావలసింది మననుండి ప్రేమ మాత్రమే కానీ మనమెన్నిసార్లు ఆయనను దర్శించామనికాదు. పళ్ళు ప్రసాదాలు కానుకలు అసలేకాదు.

“ నేను మీ మధ్యకు, మీరంతా నా ముందు సాష్టాంగపడి నాకు హారతి పట్టుటకు, నన్ను శ్లాఘిస్తూ పాడుటకు, లేదా నన్ను పూజించేందుకు రాలేదు. అవన్నీ యోగులకు, మునులకు అవుసరం. వీటన్నికంటే అధికమైన ప్రేమను మీనుండి కోరుతున్నాను. నేను మీ స్థితికి దిగి వచ్చుటకు కారణం నా ప్రేమను మీయందు ప్రసరింపచేసి తద్వారా మీరు భగవంతుని ప్రేమించి దైవంగా మారునట్లు చేయుటకే. తక్కినదంతా మిధ్య. ప్రేమను తప్ప మరి దేనిని కోరకండి. ”

“ నాకు పుష్పహారాలు సమర్పించటం, సాష్టాంగపడటం, శ్లాఘిస్తూ భజనలు చేయడం–యీ మూడూ ప్రాముఖ్యంలేని సంగతులు. అయితే భగవత్సాక్షాత్కారపథంలో మూడు ముఖ్య

మైన విషయాలున్నాయి. అవి ప్రేమ, విధేయత, సమర్పణ; ప్రేమ అనేది భగవంతుడు మానవునికిచ్చే వరం. విధేయత సద్గురువు మానవునికిచ్చే బహుమానం. సమర్పణ మానవుడు గురువుకు సమర్పించుకొనే కైంకర్యం. ప్రేమించేవారు ప్రియతమునికి ప్రేమికులు. విధేయుడైన వాడు ప్రియతమునికి ప్రియతముడు. తను, మన, ధన సర్వస్వాన్ని త్యజించినవాడు ప్రియతమునిలోనే తానుండును"

"యజ్ఞయాగాదులు, పూజా పునస్కారాలు ధ్యానం, తపస్సు, ఆరాధనా యివేవీ ప్రేమను రగుల్కొల్పలేవు. కర్మ కాండలు కొత్త సంస్కారాల్ని తెచ్చిపెడతాయి. మనసా, వాచా, కర్మణా యీ కర్మలు సంక్రమిస్తాయి. నా నిత్య కృత్యాలు నిజాయితీతో చేసుకుంటూ, నా నామాన్ని రోజుకు కనీసం రెండు సార్లన్నా స్మరించ కలిగితే యీ చక్రబంధం నుండి విముక్తి సాధించకలరు" అన్నారు బాబా.

యీ యుగావతారుడైన మెహెర్‌బాబా సకల సృష్టికి తండ్రి. మనకు తెలిసినా తెలియక పోయినా అందరి హృదయాల్లో నివశించే సర్వ వ్యాపకుడైన ఆ ప్రభువు మౌనం పాటించినట్లు బయటకు కనిపించినా మన గమ్యాన్ని చేర్చేందుకు తన మౌనాన్ని వుపయోగించారు. మొదట్లో ఒక సంవత్సరం పాటు మౌనం పాటిస్తానని ప్రారంభించిన మౌనాన్ని బాబా ఆసాంతం, అవిచ్ఛిన్నంగా కొనసాగించారు. చాలామంది ఇప్పటికీ ప్రతి జూలై 10 వ తేదీన పెదవి విప్పి మాట్లాడకుండా పూర్తి మౌనాన్ని పాటిస్తారు.

అయితే నిరంతరం మాట్లాడటానికి అలవాటు పడిన మన స్సును మౌనంగా ఆ ఒక్క రోజు వుంచటం కొంచెం కష్టమైన పనే. నిజమైన విషయాలెప్పుడూ మౌనంలోనే యివ్వబడతయి. భగవంతుడు మాత్రమే సత్యం. తక్కినదంతా మిథ్య. భగవం తుడు అనంతమౌనం కనుకనే మెహెర్‌బాబా తన అవతార మంత్రాంగాన్ని మౌనంతోనే పూర్తి చేశారు.

ప్రేమలో మౌనం సాన్నిహిత్యాన్ని సూచిస్తుంది. బాబా చుట్టూ ఎప్పుడూ ఎంతో ఆహ్లాదంగా శోభాయమానంగా వుండేది. ఆయన శిష్యులలో భిన్న మతాలకు, జాతులకు చెందినవారు విభిన్న తత్వాలు అభిరుచులు కలిగివున్నా ఆయన దివ్య ప్రేమలో అంతా ఒక్కరుగా వుండేవారు. ఆయనయందు వారికున్న ప్రేమ వలన వున్న అవరోధాలన్నీ సులువుగా తొలిగిపోయేవి. అంటే సర్వార్పణ అయినవారి జీవితాలు ఆ ప్రభువు యిచ్ఛకు లోబడి నడుస్తాయన్నమాట. మౌనంతో అందించిన ప్రేమ ప్రభావం తప్ప మరేది అంతటి సాన్నిహిత్యాన్ని కలిగించలేదు.

బహుళార్థకమైన జగత్తు మాయా ప్రభావంతో యదార్థ మైనట్లు భాసిల్లుతోంది. జగత్తు మిథ్య. భ్రమ. నిజానికది ఏకైకునికి చెందినప్పటికీ, తన వునికిని బట్టి తాను వేరన్నట్లు కనపడుతుంది. ప్రపంచంలో సత్యంలో ఐదుశక్తులున్నవి. అస్థి, భాతి, ప్రియం, నామం, రూపం. మొదటి మూడు బ్రహ్మనికి చెందినవి. తక్కిన రెండు దృశ్యప్రపంచానికి సంబంధించినవి: ఒక వస్తువు, "వున్నది" అంటే అస్థి. అది మనకు స్పష్టంగా కనపడుతోంది అంటే భాతి.

మనకు సంతోషంకలిగించే యీ వుండటం వున్నట్లు తెలియటం ప్రియం. యీ వుండటం, తెలియటం, కనపడటమనేవి బ్రహ్మం తప్ప మరేమి కావు.

సత్- చిత్ -ఆనందములు ( వునికి, జ్ఞానం, ఆనందము) దాని వెనుక వున్నవి. వస్తువులకు చెందినవి నామరూపాలు తప్ప మరేవీకావు. కనుక జగత్తు అంతా నామరూపాలే తప్ప మరేదీ కాదు. దాన్నే అద్వైత వేదాంత మంటారు. బ్రహ్మం, జగత్తుల మధ్య వుండే సంబంధం, సముద్రము, అలలకు మధ్యవుండే సంబంధం లాంటిది. మట్టికి కుండలకు మధ్య, బంగారానికి నగలకు మధ్య, వుండే సంబంధంలాంటిది. అలలు సముద్రంలో కలిసినప్పుడు సముద్రజలమే అవుతయి కానీ పేరు కావు. అదే మాదిరి మట్టిపాత్రలు, బంగారు ఆభరణాలు, మట్టికి బంగారానికి భిన్నమైనవికావు. వాటిని తయారు చేయటానికి వాడింది మట్టి, బంగారమే.

కనుక బయటకు కనపడే అలలు సముద్రపు నీరే. మట్టి పాత్రలలో వుండేది మట్టే. బంగారు ఆభరణాలలో కనపడేది బంగారమే. పేరు, రూపం తప్ప వాటిలో యదార్థమైన స్థితి లేదు. వాటిని చెడగొట్టినప్పుడు ఆ రూపం పోతుంది. పేరు పోతుంది. వాటి వునికి పోతుంది.

అజ్ఞానంలో వున్న మనం యీ సత్యాన్ని తెలుసుకోలే కున్నాం. విషయవాంఛల్లో మునిగి శరీరస్మృతి మనోభావాలు అవిద్య అనే ముసుగుతో చుట్టుముట్టబడి వుండుటవలన మాయ యొక్క-

శక్తికి రావేదారుగా లోబడి మనస్సు పనిచేస్తోంది. అందుచేత యీ సత్యాన్ని మనం గ్రహింపలేక పోతున్నాం. జ్ఞానమనే తేజస్సు యీ అజ్ఞానపు తెర తొలగింపబడితేకానీ యదార్థతను గ్రహించలేము. దానినే జీవన్ముక్తి అంటారు. జీవన్ముక్తుడు యీ సకల జగత్తును జాగృత అవస్థలో చూస్తాడు. బాహ్యంగా కనపడే విశ్వం ఒక దృశ్యం మాత్రమేనని, దానికేవిధమైన ఉనికి లేదని, కేవలం నామరూపాలు మాత్రమేనని తెలుసుకోగలుగుతాడు.

వాటివెనుకనున్న అసలు సత్యం, సర్వవ్యాపకుడైన పరబ్రహ్మానన్న యదార్థాన్ని గ్రహించకలగటమే కాక, జీవన్ముక్తుడైనవాడు, విషయవాంఛలకతీతుడై వాటికి దూరంగా వుంటాడు. మనస్సు ప్రశాంతంగా వుండి, మనోనాశ జరుగుటవలన కోరికలుండవు. మన వేదాలు నేతి నేతి అంటున్నాయి. యిది కాదు యిది కాదు అని. అనగా ఒక్క బ్రహ్మ మాత్రమే సత్యం. తక్కినదంతా మిథ్య-ఏమీ కాదు అని. అయితే యీ మాయను వదిలించుకోవటం అంత తేలిక కాదు. జ్ఞానం పొందినతర్వాత కూడ అది యింకా మిగిలే వుంటుంది. మనం కలలో ఒక పులినో పామునో చూచామనుకోండి. మెలకువ వచ్చినతర్వాత కూడ ఆ భయం పోదు. ఇంకా దడుకుతో గుండెలు కొట్టుకున్నట్లే వుంటుంది. కొబ్బరిచెట్టు ఎదిగినకొద్దీ మట్టలన్నీ రాలిపోతూ వుంటయి. అయినా ఒకప్పుడు యిక్కడ మట్ట వుండేది అన్న గుర్తుగా ఆ చార ఇంకా మిగిలేవుంటుంది.

సర్వం భగవంతునిమయం. అయితే పరిశుద్ధమైన మనస్సు, మేధస్సు, వున్నవాడే భగవంతుడు. నేను యంత్రా

నైనతే, దానిని నడిపేవాడాయన. నేను యిల్లు అయితే దానిలో వుండేవాడాయన. మనలో అహంకారమన్న కుండ వున్నన్నాళ్ళు యివన్నీ పిచ్చివాడి మాటల్లాగా ఉంటయి. అపరిమితమైన మహా సముద్రాన్ని చూడండి. అందులో ఒక కుండ ముంచాం, అప్పుడా కుండలోనూ నీళ్ళుంటాయి. బయటా నీళ్ళుంటాయి. ఎటు చూసినా నీళ్ళే. కానీ ఆ కుండలోని నీళ్ళు, బయట చుట్టూవున్న నీళ్లు ఒకటి కావాలంటే ఆ కుండని పగలకొడితేనే కానీ సాధ్యపడదు. అప్పటి వరకూ, కుండలోని నీళ్ళూ బయట నీళ్ళూ వేరుగానే ఉంటయి. "అహం" అనే యీ కుండని సముద్రంవంటి మనలో భగవంతుడే పెట్టాడు. యిదంతా ఆయన లీల, జగన్నాటకం.

మానవుని యోగమార్గంనుండి మరల్చి ప్రాపంచిక వ్యవహారాలవైపు మరల్చేవి కాంతా కనకాలు. మనస్సు నిలకడైతేనే యోగమబ్బుతుంది. యోగియైనవాని మనస్సు దైవం మీద లగ్నమౌతుంది. కోడి తన గ్రుడ్లను పొదిగేటప్పుడు తన మనస్సంతా ఆ గ్రుడ్లమీదే ఎలా నిలిపి ఉంటుందో, అలా తన మనస్సంతా ఖాళీయై, కేవలం భగవంతునిమీదే దృష్టి నిలిచిఉంటుంది. దైవ కృపఉంటేనే సాధ్యపడుతుంది. మరి ఆ కృపను పొందాలంటే, ముందు ఇంద్రియాల్ని, మనస్సును జయించాలి. దానికి బాబా సుళువైన మార్గం చూపారు. నిశ్చల మనస్సుతో రోజూ కొద్ది క్షణాలు బాబా బాబా అంటూ భగవధ్యానం చేయటం మొదలు పెడితే ఆ ధ్యానామృతం మనస్సులోకి వెళ్ళి కల్మష రహితం చేస్తుందన్నారు. సంక్షోభంలో ఉండే సంసార సాగరాన్ని అవలీలగా దాటించి, ఆనందతీరం చేరుస్తుందన్నారు.

అయితే మనం మాత్రం భగవంతుణ్ణి ఓ వ్యాపారిగా మార్చేస్తున్నాం. ఆశలకు పోయి, ఆపదలు కొనితెచ్చుకొని మొక్కుబడులు పేరుతో ఆయన్ని వ్యాపారస్తుడుగా చేస్తున్నాం. ఆయనపేర వ్యాపారం చేయడం మన అజ్ఞానానికి నిదర్శనం. గుళ్ళ గోపురాలకు ప్రదక్షిణాలు చేయటం, రకరకాల తిలకధారణ, కర్పూరనీరాజనాలు, దక్షిణ తాంబూలాదుల సమర్పణ, ప్రసాదాల ఆరగింపు, చిల్లరడబ్బులువంటివి, చేసినందువలన దైవకృప వస్తుందనుకుంటే అది ఆత్మ వంచనే అవుతుంది.

అందుకే బాబా హెచ్చరించారు. " నిన్న రాదు. రేపు లేదు. వున్నది నేడే. కనుక అవుసరమైన ఆలోచనలకు అడ్డు కట్ట వేయండి. సత్సాంగత్యం, సత్యం, ప్రేమ, ప్రభుచింతన లతో మనస్సును రుజు మార్గంలో పెట్టండి. ప్రాపంచిక మోహాన్ని పరమాత్మపై మళ్ళించండి. అప్పుడే ఆయన అను గ్రహం మీపై తప్పక వర్షిస్తుంది. నన్ను ప్రేమించండి నా ప్రేమను పొందండి. నేను మీ మధ్యకు వచ్చాను " అన్నారు. ఈ జీవితాన్ని ఎంత తరచినా అర్థం కాదు. మనస్సులో దైవ చింతన లేకపోతే ఆ జీవితం దుర్భేద్యమైన రహస్యంగా మిగిలి పోతుంది. కామ క్రోధాలు పోవాలి. చెప్పింది చేసేటట్లుగా వుండాలి.

మనసులో ఒకటి, చెప్పేది ఒకటి, చేసేది ఒకటిగా వుండ కూడదు. మనస్సులో ఎంతవుంటే, అంతే శరీరంతో చేయాలి. వాక్కుతో చెప్పాలి. కామక్రోధాలు పోతేగానీ, అలానడుచుకోలేం. యింద్రియాల్ని ఆశ్రయించినందువల్లే, కామం పరమ శత్రువై

కూర్చుంది. బాబా యీ శరీరాన్ని కదిలేపాయఖానా అన్నారు. అందులో వుండేది రక్తమాంసాదులు, ఎముకలు. అవన్నీ తోలుతో కప్పబడివున్నాయి. కేవలం కట్టెలరాశి. ఎప్పటికైనా నశించి పోయేదే. భౌతికంగా చూచినప్పుడీ శరీరం విలువ లేనిది.

అయితే ఆధ్యాత్మికంగా అది ఎంతో విలువైంది. అది మోక్షసాధనం. మోక్షానికి అర్హమైనదీ మానవజన్మ. యీజన్మని వృధా చేయకూడదు. సాక్షాత్తు భగవంతుడు మానవరూపధారియై వచ్చినప్పుడు, ఆయనకు సమకాలికులమై, ఆయన కొంగు బంగారు భాగ్యముకలిగి, ఆలింగన, స్పర్శ, దర్శన భాగ్యం పొందిన మనం ఎంత అదృష్టవంతులమో మాటలలో చెప్పలేం "సాధూనాం దర్శనం పుణ్యం" అంటోంది మన వేదం. "సాధు వందనమే మోక్ష సాధనం" అన్నాడు రామీ. సాధు స్పర్శతో సమస్త పాపాలు పటాపంచలవుతాయట. సాధు సంభాషణ శతకోటి తీర్థ స్నానాల పవిత్రతను ప్రసాదిస్తుందట. ఒక్క క్షణం సాధు సమక్షంలో గడపగలిగితే 100 సంవత్సరాల తపస్సు చేసిన యోగికూడా పొందలేని అదృష్టవంతుడని చెపుతూ బాబా, "అటువంటప్పుడు, నా సమక్షంలో మెసలుతున్న మీరు ఎంతటి అదృష్టవంతులో మీరు తెలుసుకోలేరు" అన్నారు బాబా.

"అందరూ నా వద్దకురండు" ఇది ఆయన పిలుపు. అయితే మాయ యొక్క తెర అడ్డు వుండుట వలన, మనకాయన పిలుపు, మరు భూమిలోని కేక అయింది. నిజానికా పిలుపు యొక్క శబ్ద తరంగపరంపర విశాల విశ్వాంతరాళంలో ఎప్పుడూ

ప్రతిధ్వనిస్తూనే వుంటుంది. మరి, మిథ్య యొక్క మధ్యలో ధ్వనులపు ధ్వనిస్తూన, ఆ సనాతనుని పిలుపు యొక్క ధ్వని మానవాళిని మేల్కొలుపుతుంది. "యిప్పుడు సమయమాసన్న మైంది. నేనా పిలుపును మరల పునరావృతం చేస్తున్నాను. అందరూ నా వద్దకు రండని చెపుతున్నాను. ఆజ్ఞాపిస్తున్నాను." అన్నారు బాబా.

ఆ దైవమే మానవరూపంలో వచ్చి, జ్ఞానబోధలెన్ని చేసినా, మనం మాత్రం ప్రాపంచిక వ్యవహారాల్లో మునిగి, ఎన్ని కష్టాలైనా భరిస్తామే తప్ప సత్యాన్ని గ్రహించలేకున్నాం. ఒంటె ఎప్పుడూ ముళ్ళ మండల్నే తింటుంది. ముళ్ళుండే కొమ్మల్ని తినటంవలన దాని నోటి నుండి రక్తం స్రవిస్తుంది. అయినా అది ముళ్ళ మొక్కల్నే తింటుంది కానీ వాటిని వద లదు. ఈ జగత్తంతా భగవంతుని నుండి మానవుని వద్దకు వచ్చింది. ప్రతి ఒక్కరి హృదయాంతరాళమునందు లోతుగా పాతుకుపోయి వున్నది. అక్కడ భగవంతుని కొరకు ప్రేమ బీజం నాటబడుచున్నది. ఆ బీజం మొలకెత్తి త్వరితగతిని పెరిగి, పెద్దదై, మహావృక్షం కావాలంటే వ్యక్తిగతంగా అతడు సత్యాన్ని అంగీకరించటంపై ఆధారపడి ఉంటుంది. యీ జగత్తంతా మిథ్య. దేముడొక్కడే సత్యం. అయితే మనం అజ్ఞానం చేత "X" అనో "Y" అనో అనుకుంటున్నాం. అందుకే బాబా అన్నారు. "నేను నా దైవాధికారంతో చెబుతున్నాను. వినండి. మీరు – నేను కలిసి మనం అవటం లేదు. నేనే అడుగుచున్నాను"

అని సకల జీవులందు ప్రతి పదార్థమందు ఆయన సర్వవ్యాపకుడు. కనుక సర్వమందు ఆ పరమాత్మ తప్ప మరొకటి వుండదు.

" అట్టి సర్వవ్యాపకునితో సమైక్యం కావాలంటే ముందు దేముడ్ని నీలో ప్రతిష్టించు. ప్రథమంలో బాగా లోతులలోకి చొచ్చుకొని యీదుకుంటూపో. అట్టడుగున, నట్ట నడిసముద్రంలో మునిగి ముత్యాల్నిఏరుకో " అని బాబా బోధించారు. కానీ అలా లోనికి మునుగుటను ఎవరూ కోరుకోరు. మునగకుండానే ముత్యాలు కావాలంటారు. మానవులకు భక్తి లేదు. ఆధ్యాత్మిక క్రమశిక్షణ లేదు. ఏమీ సమర్పించుకోకుండానే ముక్తి కావాలంటారు.

మనం బాబాను ఆరోగ్యం కోరో, సంపద కోరో, లేదా కుటుంబసభ్యుల అభివృద్ధి కోరో ప్రేమిస్తే, అట్టి ప్రేమ వాటిని ప్రేమించినట్లే కానీ, బాబాను ప్రేమించినట్లు కాదు. " ప్రేమ అగ్నికి ఆజ్యం పోస్తుంది దానిని మనం చూడకలగాలంటే నిష్కపట ప్రేమ అలవడితేనే సాధ్యపడుతుంది " అన్నారు బాబా. యదార్థ ప్రేమికుడు తాను భగవంతుని కొరకు మరణించి నప్పుడే యదార్థ జననం పొందుతాడు. ఎవరైతే తమ సర్వస్వం నాలో పోగొట్టుకుంటారో వారు ఆ సర్వస్వాన్ని నాలో ఎల్లప్పుడు చూడగలరు. "

" భౌతిక దృష్టి ఉన్నప్పటికీ దైవాన్ని చూడనివారు అంధులే అవుతున్నారు. చూడతగిన ఏకైక పదార్థం దేముడొక్కడే. కనుక ఎవరైతే భౌతిక దృష్టి కలిగి వుంటారో వారు

పుట్టించబడినప్పటికీ దైవ ప్రేమతో అంతరంగంలో దైవారాధనా పరులైన అంధులకంటే కూడా యింకా అధికమైన అంధులతో సమానం ”

“నేను ఆ సనాతనుడను. సర్వోన్నతుడను నన్ను యధార్థంగా ప్రేమించువారికి నేను బానిసను. ఎవరైనా, నా యధార్థ స్థితి యొక్క అనుభూతిని ఒక్క క్షణం అనుభవించాలంటే, వారు వెయ్యి సార్లు ఖండ ఖండాలుగా ముక్కలగుటకు ఆనందంతో అంగీకరించాలి.” అన్నారు అంటే, తన పరిపూర్ణ బ్రహ్మత్వాన్ని విశద పరచాలన్న మాట. జ్ఞానులు పిలిచే యీ బ్రహ్మన్ని యోగులు ఆత్మ అంటారు. భక్తులు భగవంతుడు అంటారు. అందుకే భక్తుల హృదయం భగవంతుని ఆవాసం అవుతోంది. ఆయన అందరి హృదయాల్లోనూ వుంటాడు. కానీ భక్తుల హృదయంలో తనకు తాను ప్రతిష్టుడౌతాడు. ఎలా ?

ఒక భూకామందు వున్నాడనుకోండి. ఆయన తన ఎస్టేటులోని అన్ని భాగాల్ని ఎప్పుడో ఒకసారి దర్శిస్తాడు. అయితే ఆయన ఎస్టేటులోని ప్రజలు మాత్రం, ఆయన తన డ్రాయింగు రూంలోనే దొరుకుతాడని చెప్పుకుంటారు. అలాగే భక్తుల హృదయం దేముడి డ్రాయింగురూం. సర్వ శ్రేష్టుడైన భగవానుడు, నీలోనివాడు యిరువురూ ఒక్కడే, వున్నది ఒక్కరే. ఆయన అవిభాజ్యుడైన పరమాత్మ.

ఆయనను నీవు తెలుసుకోవాలంటే, నీ విధులన్నీ నిర్వర్తిస్తూ నీ మనస్సును మాత్రం దైవంపై కేంద్రీకరించు. కుటుంబంతో కలిసి జీవించు. గృహస్తుగా భార్యా బిడ్డలు, తల్లి,

"తండ్రీ, వాళ్ళతో వుంటూ వారికి సేవచేయి. వాళ్ళంతా నీకు కావలసిన ప్రేమ పాత్రులుగా చూసుకో. కానీ నీ హృదయాంతరాళాల్లో వారు నీకు సంబంధించినవారు కారని తెలుసుకో."

చూడండి- ఒకభాగ్యవంతుని యింట్లో పనిమనిషి, యింటి పనులన్నీ చేస్తుంది. కానీ ఆమె ఆలోచనలన్నీ తన యింటి మీదే వుంటాయి. తన యజమాని పిల్లల్ని తన పిల్లలు లాగానే సాకుతుంది. వాళ్ళని "నాబాబే," "నాతల్లే," అంటూ తన స్వంత పిల్లల్ని పిలిచినట్లు పలకరిస్తుంది. అదే సమయంలో వారు తన పిల్లలుకారని ఆమెకు తెలుసు. అయినా తన పిల్లలలాగే చూస్తుంది. అలాగే గృహస్థు జీవితం గడుపుతూ మనదృష్టి దైవంపై కేంద్రీకరించకలిగితే, అశాశ్వతమైన బంధాలనుండీ విముక్తి కలుగుతుంది.

దైవప్రేమలేకుండా ప్రాపంచిక వ్యవహారాల్లో దిగితే, ఇంకా ఇంకా అందులో మునిగిపోతాం. ఎన్నో ప్రమాదాలు, బాధలు, దుఃఖాలు ఎదుర్కోవలసి వస్తుంది. ప్రాపంచిక వ్యవహారాల గురించి మనం ఎంతగా ఆలోచిస్తే, అంతగా వాటికి అతుక్కుపోతాం. పనసపండు కోయాలంటే ఏంచేస్తాం? ముందుగా చేతులకు చమురురాసుకోవాలి. లేకపోతే దానిపాల జిగురు చేతులకు అంటుకుంటుంది. అలాగే దైవప్రేమ అనే చమురు సంపాదించి, చేతులకు పులుముకుంటే తప్ప, ప్రాపంచిక ధర్మాల్ని నిర్వర్తించలేం.

అటువంటి దైవప్రేమ సాధించాలంటే, సాధన కావాలి. పాలనుండి వెన్నతీయాలంటే పాలనుకాచి, గిన్నెలో తోడుపోసి,

కదలకుండా భద్రంగా ఉంచి, తర్వాత చిలికితేనే వెన్న వస్తుంది. పాలగిన్నెను కదిపితే పాలు తోడుకోవు. పెరుగు తయారుకాదు. అలాగే "నీ విధి నిర్వహణలో నీ మనస్సును చెదిరిపోనీయక, ప్రశాంతంగా ఉంచి, ఏకాగ్రతతో దైవంపై లగ్నం చేసి పెరుగును చిలుకు. వెన్నను పొందు." అన్నారు.

ఈ ప్రపంచం నీరు వంటిది. అది దుఃఖ భాజనమైన మహాసముద్రం. మన మనస్సు స్వచ్ఛమయిన పాలవంటిది. పాలు నీళ్ళల్లో పోస్తే కలిసిపోతై. అందులో స్వచ్ఛమయిన పాలను కనుగొనలేము. కానీ ఆ పాలను తిన్నగా నీటిలో పోయకుండా పెరుగుగా మార్చి చిలికి వెన్నతీసి, అలా లభ్యమయిన వెన్నను నీటిలో వేసినప్పుడు అది నీటిపై తేలుతుందే కానీ మునిగిపోదు. అందుకే బాబా పక్కాని మార్గం చూపారు.

"నిస్వార్థంగా నీ విధి నిర్వహించు. ఫలితం ఆశించి ఏ పని చేయకు. ఏం చేసినా అది పనిక్రిందే లెక్క. దైవాన్ని ప్రార్థన చేయడం కూడ పనే. ఆయనే నేనన్న భావంతో ద్వంద రహితంగా చేయాలి ఏ పని చేసినా. శ్వాస పీల్చటం కూడ పనే. పని చేయటం త్యజించేందుకు మార్గంలేదు. కనుక పని చేయి. దాని ఫలితాన్ని దైవానికి వదిలేయి" అన్నారు. కనుక మనం కాంతా కాంచనాలకు అతీతంగా జీవితం గడుపుతూ, ఆధ్యాత్మిక క్రమ శిక్షణ అలవరచుకోగలిగినప్పుడు ప్రాపంచిక వ్యవహారాల్లో వున్నా వాటికి వశులం కాబోము. అప్పటి మన మనస్సు వెన్న లాంటిది. అట్టి వెన్నను ప్రాపంచిక వ్యవహారాల్లో ఉంచినా అవి కలిసిపోవు. వెన్న తేలిపోతుంది కదా!

బాబా మన ప్రియతమదైవం. ఆయన సర్వారాజ్య సార్వ భౌముడు. రారాజు. ఆయన తనతో అనంతప్రేమ అనే అమూల్య సంపద తెచ్చారు. ప్రాపంచిక సంపద వున్నచోట యిట్టి ప్రేమకు స్థానం ఉండదు. బాబా విషయంలో కూడ చూడండి. కోట్లాది రూపాయలు తనచేతుల మీదుగా ఖర్చు పెట్టినప్పటికీ బాబా నిత్యనిరంత ఫకీరు 'నేనన్నారు. ఆయన ఒకే సమయంలో రాజాధిరాజుగానూ, యాచకుడైన కటిక పేదవానిగానూ వుంటారు. అందుకే ఆయన నిత్య నిరంతర ఫకీరుననిచెప్పేవారు. " సత్యం ద్వారా పలికే పలుకులకు యదార్థ అర్థంవుంటుంది. కానీ అవే మాటల్ని మానవుడు తన స్వంతమాటలుగా పలికినప్పుడు అవి అర్థంలేనివే అవుతున్నాయి " అని బాబా చెప్పారు.

ఈ సృష్టిలో భగవంతునిచే సకల జీవకోటి సృష్టించ బడింది. మానవులు, పశు పక్ష్యాదులు, చెట్లు చేమలు, యిలా ఎన్నో, మరి పశు పక్ష్యాదులలో కొన్ని మంచివి వున్నయి. కొన్ని చెడ్డవి వున్నయి. భయంకర జంతువులు పులులు, సింహాలు. విషపూరితాలు తేళ్ళు, పాములు. అలాగే కొన్ని చెట్లు అమృతంవంటి పళ్ళనిస్తయి. మరికొన్ని విషపూరిత కాయలు కాస్తయి. అదేమాదిరి మానవుల్లోనూ మంచివారున్నారు. చెడ్డ వారున్నారు. కొందరు దైవ భక్తులున్నారు. మరి కొందరు ప్రాపంచిక వ్యవహారాల్లో మునిగిపోయారు.

బాబా తెచ్చిన అమూల్య సంపదని, దైవ ప్రేమను పొందే అర్హత మనం పొందాలంటే, భగవంతుని సృష్టిలోని

అందరిలోను భగవంతుడున్నాడన్న సత్యాన్ని నిస్సందేహంగా విశ్వసించి ఎవరితో ఎంతవరకు ప్రవర్తించాలో అంతవరకూ మాత్రమే సంబంధం కలిగి ఉండాలి. దుష్టులకు దూరంగా వుండాలి. విమర్శించేవారిపై సైతం ఆప్యాయత చూపకలగాలి. దేముడు పెద్దపులిలోనూ వున్నాడు. అందుకని మనమా పులిని కావిలించుకోలేము కదా ! అదీ భగవంతుని అవతారమే. కానీ దాని స్వభావాన్నిబట్టి దానికి దూరంగా వుంటాము.

మనకు జలం అతి పవిత్రమైంది. నీరు భగవంతుని రూపం. గంగాభవాని అంటారు. ఈ నీళ్ళే, కొన్ని పూజకు పనికి వస్తై. కొన్ని ముఖం కడుక్కోవటానికి, కొన్ని అంట్లు కడుక్కోటానికి, మురికి వదిలించుకోటానికి, వుపయోగపడుతున్నాయి. మురికి నీటిని త్రాగటానికో, ఏ పవిత్ర కార్యానికో వాడరు. అదే నీటిని ఆయా కార్యక్రమాలకు, ఎలా ఉపయోగిస్తున్నామో, అలాగే అందరిలోనూ వున్న భగవంతుణ్ణి, దర్శించకలిగే స్థాయికి ఎదిగి, దైవ ప్రేమను పొందే అర్హత కలిగేటట్లు మనకు బాబా శిక్షణ యిచ్చారు.

భౌతిక వాంఛలకు బందీలైనవారు, ఆశాపాశాలకు బందీలు. కాళ్ళు చేతులు కట్టివేయబడిన బంధితులు. ధారాపుత్రాదులు, భోగభాగ్యాలే వారికి భద్రతను కలిగిస్తాయని, వారు భ్రమిస్తారు. అవి తమ వినాశనానికి దోహదపడతాయని తెలుసుకోలేరు. అటువంటి మనల్ని వుద్ధరించేందుకే బాబా వచ్చారు. “పులి నోట చిక్కిన మేక ఎలా తప్పించుకు పోలేదో అలాగే గురువు

అనుగ్రహం పొందినవాడెన్నడూ తప్పించుకు పోలేడు. నీవు నిశ్చింతగా వుండు. అంతా నేనే చూసుకుంటాను" అన్నారు బాబా. నా వాళ్ళ నెవ్వరినీ, నా నుండి తప్పించుకుపోనివ్వనని అభయమిచ్చారు.

కనుక ఆయన ప్రేమను చూరగొనాలంటే ఆయన యందు భక్తి కలిగివుండాలి. భక్తి అంటే ప్రేమ భజనచేయడం. ఏం చేయమంటే అది చేస్తున్నాను అనేది భక్తి. "నేను" అనేది బుద్ధిగోళం. "నేను" అనేది పోవాలి. అది బోధలవల్లరాదు. లోకసంగ్రహార్థం చేసేది కర్మ. "బాబా" అంటే స్మరణ అయిందికానీ అది భక్తి అవదు. భక్తిలో దేహాభిమానం వుండదు. పూర్తి విధేయత కావాలి. పరిపూర్ణ నమ్మకం పెరగాలి. ఆయనపై మనకు పూర్తి నమ్మకం ఎప్పుడైతే కలిగిందో, అప్పుడాయనే, అన్ని కష్టాల్నితీరుస్తాడు. నమ్మకంతో సర్వమూ ఆయనకు వదిలినప్పుడు, సర్వమూ ఆయనే చూసుకుంటాడు. భగవంతుడ్ని విధేయతతో ప్రేమించినప్పుడే ఆయన వశపడతాడు.

"ఈ నాటి యువకులంతా రేపటి పౌరులు. అన్నీ కూడ మొదట్లో చిన్నవిగానే వుంటయి. చిన్న విత్తనం మొలకెత్తి, మహావృక్షమవుతుంది. చిన్న బిడ్డ పెద్దమనిషిగా పెరుగును. అటువంటి మానవుడు, తన జీవితంలో నేర్చుకునే పాఠాలు, అవి మంచిగానీ, చెడ్డగానీ, వుపయోగపడాలంటే ప్రధానంగా యవ్వన దశే మూలం. అయితే అతడు పెరిగి పెద్దవాడైనా, ఆధ్యాత్మిక దృష్టిలో ఇంకా చిన్నపిల్లవాడే. యీ ప్రపంచము ఒక శిశువిద్యా

మందిరం వంటిది. ఎన్నో జన్మలెత్తే మానవుడు యీ ప్రపంచ మనే పాఠశాలలో, విరుద్ధ ద్వందానుభవాలనే పాఠాల్ని నేర్చు కుంటున్నాడు. మంచి – చెడూ, సుఖం – దుఃఖం, సిరిసంపద- పేదరికం మున్నగునవి ”

“ బళ్ళో చదువుకొనే పిల్లలకు వేర్వేరు బోధనా భాషలు చెప్పేందుకు వేర్వేరు ఉపాధ్యాయులున్నట్లే, మరి యిటువంటి ఆధ్యాత్మిక పాఠశాలలో కూడ అనేక శ్రేణులకు సంబంధించిన గురువులుంటారు. వారు, అన్వేషకులు దైవజీవితం గడిపేట్లు మార్గదర్శకత్వం వహిస్తారు. అటువంటి గురువుల్ని కలిసి అనుస రించ కలిగే అదృష్టం ఏ కొద్దిమందికో లభిస్తుంది. నీవు ధూళి పైతే కానీ దైవాన్ని కనుగొనలేవు. అయితే తిన్నగా నీవు ధూళివి కాలేవు. ముందు శిలగా మారాలి. అంటే సాధారణ మానవచైత న్యాన్ని కోల్పోక, అది పుంచుకొనే శిలగా తయారవ్వాలి. అప్పుడు సద్గురువు పాదసన్నిధిలో నీకు నీవే ధూళిగా మారిపో గలవు. ” అన్నారు బాబా.

రాగికి చింతపండు తగిలిస్తేనేకానీ, మెరుగు రాదు. అలాగే ఒకయదార్థ గురువు యొక్క చేతులలోనే, దుష్టునికి మెరుగు వస్తుంది. అయితే చింతపండును రాగిమీద వేసిరుద్దితే గదా ! రాగికి మెరుగు వచ్చేది. అలాగే గురువు, అట్టి దుష్టుడు తన దగ్గరికి వస్తేనేకానీ, తగు మెరుగు పెట్టలేడు. ఒకవ్యక్తి జ్ఞాన వంతుడు కావాలంటే, బోధలుకాదు కావలసింది. ఆచరణకావాలి. ఇతరులకు సలహాలిచ్చే చతురత జ్ఞానాన్ని సూచించదు.

మరి మెరిసేవన్నీ ముత్యాలు కానట్లు, కాషాయాంబరాలు ధరించినవారంతా గురువులు కారు. వారిని గురించి బాబా చక్కగా వివరించారు. "వారంతా సముద్రపు ఒడ్డున దొర్లే నత్తగుల్లల వంటి వారు. మెరిసేవాటి ఆకర్షణకు లోబడి సంచరించే వ్యక్తులు వశులై, వాటిని ఏరుకొని, ఆహా! యింత విలువైన సముద్రసంపదను నేనేకదా పొందాను" అనుకుంటారు. మరి అంతమాత్రంచేత, ఆ నత్త గుల్లలు, ఎక్కడో సముద్ర గర్భంలో అరుదుగా దొరికే ముత్యాలవుతాయా అవి? అందుకే హాఫీజు అంటాడు. "నత్త గుల్లలను ముత్యాలతో పోల్చే యీ ప్రజలు ఎంత మూర్ఖులు?" అని. అలా చెపుతూ బాబా తన వైపు వేలుచూపి, యదార్థ ముత్యం యిక్కడ వున్నది. నత్త గుల్లలకొరకు పోకండి. నేను రారాజును. అనంతమైన ధనాగారానికి అధిపతిని. మీరు ఎంత సంచి తెచ్చుకొంటె, అంత యీ ధనాగారం నుండి పొందవచ్చును. నా ధనాగారానికి, నారాచ ప్రాసాదానికి కావలివారైన, సాధువులు గురువులవైపు ఏల పరుగిడెదరు?" అని హెచ్చరించారు.

"దుఃఖంతో వ్యధ చెందకుడు. కష్టాలొచ్చాయని విచారించిక, నీకొచ్చిన కష్టాల గురించి నాకు ధన్యవాదాలు చెప్పుకో. మీకు కలిగిన కష్టాలు దైవమిచ్చిన బహుమానంగా స్వీకరించండి. మీకు కలిగే కష్టాలవలన ఒక్కొక్కప్పుడు మీరు నూరుశాతం వ్యధను అనుభవించవలసి వస్తుంది. అది ప్రకృతి సహజం. నేను సర్వజ్ఞుణ్ణని జ్ఞాపకం పెట్టుకోండి. ప్రతిదీ తప్పుగా జరిగి

నప్పుడు, మనస్సు నిస్సహాయమౌతుంది. హృదయంపై ఆధార పడుతుంది. అదే సరియైన సమయం. మీరు నామీద ఆధారపడి నాకు సమర్పణ అయినా సహాయాన్ని అర్థించవలసిన సమయం అదే. సమస్తం నాకు వదిలినప్పుడు, నేను మిమ్మల్ని అశ్రద్ధ చేయుటకు సాహసించను. అప్పుడు మీరు మీ కష్టాలనుండి ఉప శమనం పొందగలరు." యిది బాబా మనకిచ్చిన సూక్తి.

యీ ప్రపంచమంతా వల లాంటిది. దానిలో బందీలం మనమంతా. గురువు సాంగ్యతం లభిస్తే కానీ, యీ సత్యాన్ని తెలుసు కోలేం. బాబా యీ జగత్తుకి, నిస్వార్థ సేవా భావం, విధేయతలతో కూడిన మార్గాన్ని చూపారు. నిస్వార్థ సేవా భావమంటే, ఫలితముల వలన చలించని లక్షణం కలిగి వుండటం. సూర్యుడు ఏ విధంగా ప్రపంచ మంతటికీ యీ సకల సృష్టిపైన తన వెలుగును ప్రసా దించి సేవచేస్తున్నాడో అలాంటి లక్షణం నీలో వుంటే అప్పుడు నీవు నాతో వుండగలవు" అని బాబా విశదీకరించారు. సమర్పణ గురించి బాబా చేసిన ఆశ్చర్యకరమగు ప్రకటన అమూల్య మైనది. "మీ యొక్క సమర్పణ నా ముందు ఒక నిద్రలేని వాడు పడే బాధవంటి తపనతో హృదయపూర్వకంగా వుంటే నన్ను పొందగలరు. నిద్ర కరువైనప్పుడు, అవకాశం దొరికిన మరుక్షణంలోనే, పోతుందన్న భయంలేకుండా ఎలా నిద్రకు వుపక్రమిస్తాడో అలా మీరు నాకు సమర్పణ కావాలి" అన్నారు.

బాబా మౌనం ప్రారంభించిన మొదటి రోజుల్లో, దాదాపు ఒక సంవత్సరంపాటు కొయ్య ఘోషాలో గంటల తరబడి

కూర్చొని, యింతవరకు ప్రచరించకుండా అతి రహస్యంగా వుంచబడిన "ది బుక్" అన్న గ్రంథాన్ని వ్రాశారు. బాబా స్వయంగా వ్రాసిన యీ గ్రంథరాజంలో, యింతకుముందెన్నడూ బహిర్గత పరచని, ఎవ్వరికీ తెలియని ఆధ్యాత్మిక రహస్యాలున్నా యని, అత్యంత చైతన్యాతీత స్థితిలో తన స్వంత అనుభవముల కథతో పాటు, శాస్త్రీయ పరమైన అనేక ఆధునిక విషయాలెన్నో అందుదాగివున్నాయని సమయం వచ్చినపుడల్లా బాబా చెప్పేవారు. నిజానికి పుస్తకంలో విషయాలు, సమీప మండలి వారికి కూడ తెలియదు. పుస్తకం వ్రాయటం పూర్తి చేసిన తర్వాత, దానిని భద్రపరచి తాళంవేసి, మండలివారెవరూ చూడవద్దని ఆదేశించారు. దానిని తన బైబిలుగా చెప్పేవారు. సమయం వచ్చినప్పుడు అది ప్రచురించబడుతుందని ప్రకటించారు.

బాబా ఆంతరంగిక కార్యక్రమమేదైనప్పటికీ, అది మనకు అవగాహన కానప్పటికీ, బాహ్యంగా ఆయన శారీర కంగా బాధలుపడినట్లు అవగత మవుతుంది. 1952 లో అమెరికాలో జరిగిన కారు ప్రమాదంలో ఎడమ పార్శ్వమంతా, కాలూ చేయి, విరిగిపోయాయి. అంతకుముందు కొన్నిసంవత్సరాలక్రితమే బాబా, శారీరకంగా తనకు స్వయం కల్పిత ప్రమాదము జరుగ నున్నదని అది అమెరికాలోనే జరుగుతుందని, అది భగవంతుని సంకల్పమని జోశ్యం చెప్పారు. అలాగే జరిగింది.

యీ ప్రమాదంతోపాటు 1956 లో భారత దేశంలో జరిగిన మరో ప్రమాదంలో ఆయన మోకాలు విరుగుట చేత

శారీరకంగా ఆయన పడేబాధను అంతా చూడకలిగారు. యీ సందర్భంలోనే బాబా తన వ్యధను గురించి వివరిస్తూ "నేను మహాశక్తి జ్ఞానాందసాగరుడ్ని. యీ సకల మానవాళిని, బాధల నుండి, నిస్సహాయతత్వంనుండి విముక్తిపరచుటకు, నేనే విశ్వాత్మకబాధల్ని నిస్సహాయతను అనుభవిస్తున్నాను. జీసను తనకు అనంతశక్తి వున్నప్పటికీ, అవమానాలను భరించి, అపహాస్యం చేసినా, మీద వుమ్మివేసినా ప్రజలను అలా చేయనిచ్చాడే కానీ అభ్యంతర పెట్టలేదు. శిలువ వేయునప్పుడు కూడ తనను తాను రక్షించుటకు ప్రయత్నించలేదు."

"మీకువలెనే నాకూ శరీరంవుంది. మనస్సూ వుంది కనుక నేనూ ఆకలి దప్పులను అనుభవిస్తాను. అయితే నాకు విశ్వాత్మ శరీరముకూడ వున్నది–విశ్వాత్మక మనస్సువున్నది. అందువలన మీ వ్యక్తిగత బాధలు, నా శాశ్వతమైన విశ్వాత్మక బాధలముందు పోల్చినప్పుడు అవి శూన్యము అవుతాయి. నేను అనంతజ్ఞానాన్ని కలిగివున్నాను. తెలుసుకొనుటకు మనస్సను వుపయోగించే అవసరంలేదు. అనంత జ్ఞానాన్నే వుపయోగిస్తాను. నేను అనంతశక్తి, అనంత ఆనందాలు కలిగి వున్నప్పటికీ, వాటిని నా యిచ్ఛ ప్రకారమే వుపయోగిస్తాను. నా ఆజ్ఞాపాలనలో అనంత శక్తి వుండికూడ, నేను నిస్సహాయతగా వున్నానంటే దానికి కారణం, నేను దానిని వుపయోగించ నందువలననే."

"అట్టి శక్తిని, నేను నా మౌనాన్ని విరమించినప్పుడు విశ్వాత్మకమైన ఆధ్యాత్మిక మేల్కొలుపు, యిచ్చుటకు మాత్రమే

వుపయోగిస్తాను. నా యీ శరీరాన్ని త్యజించిన తదుపరి, నా అవంత ఆనందాన్ని 700 ఏళ్ళ వరకు అంటే నా తదుపరి ఆగమనము వరకూ వుపయోగిస్తాను. నన్ను గట్టిగా పట్టుకొని వుండండి. అందువలన నేను ఎక్కడికి వెళితే అక్కడకు మిమ్మల్ని తీసుకు వెళతాను. లేనిచో మీరు వదిలివేయ బడతారు. నేను మహాచక్రవర్తిని. భగవత్వ్యతిరేకత మిక్కుటంగా ప్రబలివున్న కాలమిది. సాధువులుగానో, ఆధ్యాత్మిక శక్తిసంపన్నులుగానో నటిస్తూ తమకు తామే గురువులుగా చెలామణి అవుతున్నవారు ఎక్కువ అగుట వలన నేను మానశికబాధను అనుభవించవలసి వస్తోంది.

" నేను నాలో ఎంత స్వేచ్ఛగా వున్నప్పటికీ, అజ్ఞానముచే చుట్టబడిన మీలోని నన్ను నేను చూడకలుగుటవలన, మీపై నాకున్న కరుణ, నన్ను వ్యధ పడేటట్లు చేస్తోంది. యిట్టి రహస్యాలు నేను ఇంతకు ముందెన్నడూ, నా గత అవతార సమయాల్లో బహిర్గత పరచలేదు. ఎందుకంటే అప్పట్లో సమయమింకా పరిపక్వమునకు రాలేదు. యీనాడు శాస్త్ర విజ్ఞానం అభివృద్ధి చెంది కుప్ప తిప్పలుగా పెరిగిపోయింది. దానితోపాటు భగవత్వ్యతిరేకత కూడ గరిష్ట స్థాయికి చేరుకుంది. మరి అటువంటప్పుడు, ఆధ్యాత్మికత కూడ అధికతమము కావాలికదా ! నా కొంగు పట్టుకున్నవారు అదృష్ట వంతులు " అని బాబా చెప్పారు.

ఆయన కొంగు పట్టుకోవటమంటే చాలా చక్కని వుదాహరణ చెప్పారు. ఒక పశిపిల్లను ఏ తిరునాళ్లకో తీసుకొని

వెళ్ళినప్పుడు, ఆ పసిది కొత్త వాతావరణంలో, ధ్వనులు, దృశ్యా లకు భయపడి, బంగారుతో యాంత్రికంగానే తల్లి కొంగు అంచు విడవకుండా గట్టిగా పట్టుకుంటుంది. అంటే అలా పట్టుకొంటే తనకు రక్షణ కలదని తలుస్తుందన్నమాట. అలాగే తీవ్రమైన కార్యక్రమాల మధ్య తనను జ్ఞాపకం పెట్టుకొని తన కొంగు గట్టిగా పట్టుకొని తన మీద ఆధారపడమన్నారు. ఆయన మీదనే ఆధారపడినప్పుడు బాధ్యతంతా తనపై వేసుకొని మనల్ని ఆదు కొనుటకు సిద్ధంగా వుంటాను " అన్నారు బాబా.

యిప్పుడాయన శరీరత్యాగం చేశారుకదా ? ఆయన నుండి, ఎలాంటి లబ్ధి పొందగలమన్న ప్రశ్న రావచ్చును. అయితే అసలు శరీరము లేకుండా వుండటమే ఆయన సహజ స్థితి. శరీర ధారణ ఆయనకు అసహజమైన విషయం. శరీరమనే శవపేటి కలో ఆయన మనకొరకే వుండిపోయారు. మనం దానిని ఆయన జీవనం అనుకుంటున్నాం. మానవ శరీరమనే యీ చిన్న శవ పేటికలో అనంతుడైన ఆయన తనకు తాను యిముడ్చుకొనుట చేతనే, ఆయన" వునికి " అనే యదార్థ అనుభూతిని మానవాళి పొందకలుగుచున్నారు. ఆయన వునికితోపాటు ఆయన ప్రేమ అపారదయ, జాలి, కరుణ - యివన్నీ పొందకలుగుతున్నారు. యీ రూపాన్ని త్యజించటం వలన యిప్పుడాయన అందరిలోను అత్యంత సహజ స్థితిలో వుండిపోయారు.

మెహెర్‌బాబా తన కొంగును పట్టుకోమన్నారంటే మన జీవితాల్ని ఆయన పెట్టటం కాదు. పశిపిల్లలుగా మారటం కావాలి. అంతే కానీ, మనకు తోచినట్లు చేసేసి, తాపీగా కూర్చొని అంతా బాబాయే చూచుకుంటారులే అని ఎదురు చూడటంకాదు. పసిపిల్లల మనస్తత్వం రావాలి. ఉత్సాహంగా నిశ్చింతగా ఆడుతూ పాడుతూ విధి నిర్వహణ చేయాలి. మనసులో, తల్లి దండ్రుల రక్షణ, ఆధారము, సుఖము, శక్తి యివన్నీ బాబా కృపవలననేనన్న ఆలోచన రావాలి. అప్పుడే ఆయన సాహచర్యాన్ని పొంది, ఆయనను సంతోషపెట్టగలం.



# జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు
## ర చ న లు

| | | | |
|---|---|---|---|
| 1 | మెహెర్ కథా మంజరి ( మొదటిభాగం ) | | 3_00 |
| 2 | మెహెర్ కథా మంజరి ( రెండవభాగం ) | | 3_00 |
| 3 | మెహెర్ మండలి | | 5_00 |
| 4 | నవజీవనం | మొదటిభాగం | 5_00 |
| 5 | నవజీవనం | రెండవభాగం | 5_00 |
| 6 | నవజీవనం | మూడవభాగం | 5_00 |
| 7 | నవజీవనం | నాల్గవభాగం | 8_00 |
| 8 | మెహెర్ మందారం | (వ్యాససంపుటి) | 4_00 |
| 9 | భగవద్వచనములు | మొదటిభాగం | 5_00 |
| 10 | మౌనప్రకాశము | | 4_00 |

కాపీలకు :

అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు
మచిలీపట్నం

మ రి యు

శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు
29_36_12 మ్యూజియమ్‌రోడు, విజయవాడ-2

ముద్రణ : స్పందన ప్రింటర్స్, మచిలీపట్నం

66

